14.1.1994 శుక్రవారం, 12 పేజీలు, సంపుటి: 65, సంచిక: 2, విడిప్రతి: రు. 2.00 లు

# జమీన్ రైతు

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి



## ఎస్‌పి గారూ - ఆ ఎస్‌ఐను శిక్షించకుంటే మీరూ నిందితులే అవుతారు!

# ఆమె చావలేదు - పోలీసులే చంపారు

**నెల్లూరులో జరిగిన ఘోరం**

**నడివీధిలో గుడ్డలిప్పి కొట్టినా కాపాడే దిక్కులేక, పోలీస్ స్టేషన్‌లోనూ మాటలతో తూట్లు పొడుస్తుంటే రక్షించే వారు లేక, నిస్సహాయతతో నిర్వేదంతో వంటికి నిప్పంటించుకొని చనిపోయిన అభాగ్య యువతి విషాద గాథ**

అవును. ఆమె తనంతట తాను చావలేదు.

ఆత్మహత్య ఆమె చావుకు కారణం కానేకాదు.

పోలీసులే ఆమెను చంపారు!

అందలేని ఆదరణే అవహేళనతో అంతరంగంలోని అణువణువునూ రంపపు కోతకు గురి చేసి మరీ చంపారు.

పేదరాలు అనే పరాచికంతో పాముల్లా కాటేసి చంపారు. మనసును మాటలతో తూట్లు పొడచి మరణానికి చేరువ చేశారు.

అర్ధరాత్రి ఆడపిల్ల నడి రోడ్లో నిర్భయంగా నడిచిపోయే రోజు రావాలని గాంధీజీ కలలు కన్నాడు; కాని పట్ట పగలు నడివీధిలో నర రూప రాక్షసుడొకడు తనను వివస్త్రను చేస్తుంటే కాపాడమని పోలీస్ స్టేషన్‌కు వెళ్లిన ఆపదలో వున్న ఆడదాన్ని మరింత అవమానించి పంపే నీచ పోలీసు వ్యవస్థ ఈ పుణ్య భూమిలో పుట్టు కొస్తుందని ఆ అమాయకుడి కేమి తెలుసు?

అది తెలుసుకోకుండానే వెళ్ళాడు- అదృష్టవంతుడు!

నెల్లూరు ఉత్తరపు శివార్లలో పాల డైరీ ఎదురుగా 10వ తేది మధ్యాహ్నం తన ఇంట్లో తన వంటికి నిప్పంటించుకొని దారుణ మరణానికి గురైన శేషమ్మ (35) అనే నిరుపేద మహిళ కన్నీటి కథ వింటే- మనది నాగరిక సమాజ మని చెప్పుకోవడానికి మన మందరం సిగ్గు పడాలి; మన పోలీసు వ్యవస్థను రక్షక భట నిలయాలుగా చెప్పుకొంటున్నందుకు తలదించుకోవాలి!

శేషమ్మ నిరుపేద యువతి.

వారిది బుచ్చి గ్రామం. పొట్ట చేత పట్టుకొని నెల్లూరుకు వచ్చి, డైరీ ఎదురుగా ఒక చిన్నఇంట్లో బాడుగకు వుంటున్నారు. వారికి పదహారేళ్ల కొడుకు, పన్నెండేళ్ల కూతురు వున్నారు.

శేషమ్మ ఇంటికి ఎదురుగా ఒక ముస్లిం కుటుంబం వుంది. వారి పెరడు, ఈమె ఇంటి ముందు భాగం. ఆ ముస్లింలు కొద్దిగా స్థితి పరులైనట్లున్నారు. ఆ అహంకారం వారి స్త్రీలలో వున్నట్లుంది. ఆ పొగరుతో వారు ఉతికిన గుడ్డలు తెచ్చి శేషమ్మ ఇంటికి అడ్డంగా ఆర వేసే వారట. నడవడానికి, ఇంట్లోకి వెళ్లడానికి దారి లేకుండా చేసే వారట. దీని విషయమై ఇద్దరి మధ్య తరచు మాటలు కలుస్తుండేవి. 9 తేది ఉదయం కూడా శేషమ్మ, తన వాకిటికి అడ్డంగా వ్రేలాడ దీసి వుండిన గుడ్డలు తీసుకొని, ఎదురింటి నాజాన్‌ను అడిగిందట. ఆమె తీయలేదు. ఇద్దరి మధ్య వాగ్వివాదం జరిగింది. నాజాన్ వుంటున్న ఇంటి యజమాని భార్య పద్మావతమ్మ, నాజాన్, ఆమె సోదరులు ముంతాజ్ కలసి శేషమ్మను కొట్టారట. కొద్ది సేపటికి నాజాన్ తమ్ముడు షాజహాన్ అక్కడకు వచ్చాడట. తన సోదరిని

కొరవ 6 పేజీలో

ముఖ్యమంత్రిని దెబ్బ వేసే ప్రయత్నం

# రాష్ట్రం పగ్గాలు పివి తీసుకుంటాడా?

ప్రధాన మంత్రి శ్రీ పి.వి. నరసింహా రావు ఇటీవలి రాష్ట్ర పర్యటనతో రాష్ట్ర నాయకత్వం మారుతుందన్న పుకార్లకు తెరపడినప్పటికీ రాష్ట్ర రాజకీయాన్ని ఇక మీద ఢిల్లీ నుంచే నడిపించాలని ప్రధాని నిర్ణయించడంతో ముఖ్యమంత్రి నామ మాత్రంగా మిగిలి పోనున్నారు. త్వరలో ముఖ్యమంత్రి మారతాడని రాజధానిలో జోరుగా పుకార్లు షికారు చేస్తున్న వాతావరణంలో ప్రధాని పర్యటన మూడు రోజులు జరగడం గుడ్డిలో మెల్లలాగా కాంగ్రెస్ పార్టీకి ఊరట కలిగించింది. ప్రధాని రాష్ట్రానికి వచ్చి రాగానే ముఖ్యమంత్రిని మార్చబోవడం లేదని తేల్చి చెప్పటంతో ముఖ్యమంత్రి వ్యతిరేక లాబీలు తమ వ్యూహాన్ని మార్చుకొని చాపకింద నీరులా వ్యవహరించాయి. "ముఖ్యమంత్రి మంచి చెడ్డల జోలికి పోకుండా రాష్ట్ర ప్రభుత్వం సరిగా పనిచేయడం లేదని, అధికారమంతా రెడ్డి కులస్తుల చుట్టే ప్రదక్షిణం చేస్తోందని, పరిస్థితి ఇదే మాదిరిగా కొనసాగితే వచ్చే ఎన్నికల్లో కాంగ్రెస్ పార్టీ గడ్డు పరిస్థితి ఎదుర్కొంటుందని ముఖ్యమంత్రి వ్యతిరేక వర్గాలు ప్రధాన మంత్రికి

> బిసిలు, బడుగు వర్గాలు కాంగ్రెస్ పట్ల విముఖమైనా యన్న ఉద్దేశ్యంతో ఢిల్లీ నుంచే చక్రం తిప్పాలన్న నిర్ణయం!

ఫిర్యాదు చేశాయి. ప్రధానిని కలుసుకున్న ముఖ్యమంత్రి వ్యతిరేకుల్లో మాజీ మంత్రి డి.ఎల్. రవీంద్రా రెడ్డి, రాజ్యసభ సభ్యుడు వి.వి. హనుమంత రావు ముఖ్యులు కాగా వెనుక బడిన తరగతులకు చెందిన కె.వి. కేశవులు, సి. జగన్నాథ రావు, మాణిక్య రావు ప్రభృతులు వున్నారు. రాష్ట్ర ప్రభుత్వం పని తీరు, ఒకే కులస్తులకు పెద్ద పీట వేయడం, బిసిలను నిర్లక్ష్యం చేయడం వంటి ఫిర్యాదుల్ని ప్రధాని సీరియస్‌గా తీసుకొన్నారట. "ఇక్కడ పరిస్థితిని ఎప్పటికప్పుడు గమనిస్తూనే వున్నాను. అందుకే ఇక మీద నేనే స్వయంగా రాష్ట్ర వ్యవహారాలు చూస్తాను" అంటూ ప్రధాని హామీ ఇచ్చారట. అంటే ఇక మీద రాష్ట్ర పరంగా ఏ రాజకీయ నిర్ణయమైనా పి.వి.నే చేస్తారన్నమాట. వచ్చే నెలలో జరుగనున్న రాజ్యసభ ఎన్నికల్లో అభ్యర్థుల నిర్ణయం దగ్గర నుంచి వచ్చే ఎన్నికల్లో అభ్యర్థుల ఎంపిక తదితర కార్యక్రమాలన్నీ ఇక పై హస్తిన హస్తవాసి పైనే ఆధార పడి వుంటాయి. ముఖ్యమంత్రికి రాజకీయంగా ఇది పెద్ద దెబ్బ. ముఖ్యమంత్రిగా అధికార పీఠం

కొరవ 11 పేజీలో

# జనార్ధన్, కోట్ల మధ్యా భగ్గుమంటున్న పచ్చగడ్డి

'రాజకీయాల్లో ఏదైనా సాధ్యం' అన్నట్లుంది ప్రస్తుతపు రాష్ట్ర రాజకీయం. నిన్నటి దాకా శత్రువులుగా వున్న వారు ఇప్పుడు మిత్రుత్వం కోసం చేయి చాపుతున్నారు. మిత్రులుగా వున్న వారు శత్రువులుగా మారి రచ్చకెక్కుతున్నారు. శ్రీ నేదురుమల్లి జనార్ధన రెడ్డి ముఖ్యమంత్రి పదవిలో నుంచి దిగిపోతూ తన వారసుడిగా కోట్ల విజయభాస్కర రెడ్డిని అధికార పీఠం ఎక్కించాడు. ఆ తర్వాత నేదురుమల్లి, కోట్ల మధ్య చాలా కాలం సత్సంబంధాలు కొనసాగాయి. ఉదయం లేవగానే అటు నుంచో, ఇటు నుంచో ఫోన్ మోగాల్సిందే. అయితే ఈ ముచ్చట క్రమంగా దూరమవుతూ ప్రస్తుతం ఇద్దరి మధ్య మాటలు లేని పరిస్థితి ఏర్పడింది. విజయ భాస్కర రెడ్డి ఒక పథకం ప్రకారం జనార్ధన రెడ్డిని దూరం చేస్తూ వచ్చారు. నెల్లూరు జిల్లాలో జనార్ధన రెడ్డిని వ్యతిరేకిస్తున్న లాబీని దువ్వటంతో ముఖ్యమంత్రికి జనార్ధన రెడ్డికి మధ్య దూరం ప్రారంభమైంది. కోవూరు ఎన్నికల్లో అభ్యర్థి నిర్ణయం వెనుక కోట్ల హస్త లాఘవం జనార్ధన రెడ్డికి మనస్తాపం కలిగించింది. కోట్ల ముఖ్యమంత్రి కాకుండా అప్పట్లో అడ్డు పుల్లలు వేసిన వైఎస్‌తో కోట్ల రాజీ

> ఇద్దరి ఫోన్లూ మూగనోము పట్టాయి; విందు పిలుపుకు తిరస్కారం; వైఎస్ వర్గం కొత్త చెలిమి!

కుదుర్చుకోవటం కూడా జనార్ధన రెడ్డికి కష్టం కలిగించింది. ఈ పరిణామాల తర్వాత జనార్ధన రెడ్డిని రాజకీయంగా దెబ్బ తీసేందుకు కలిశి యాదవి రెడ్డిని రాష్ట్ర మంత్రి వర్గంలో చేర్చుకోవడంతో ముఖ్యమంత్రి తెగేదాకా లాగి జనార్ధన రెడ్డితో సత్సంబంధాలకు తెర దించారు. వైఎస్‌తో బాగుంటే చాల్లే జనార్ధన్ ఏం చేస్తాడని కోట్ల ధీమాగా వుండినారు. వై.ఎస్.ను తృప్తి పరచేందుకు ఆయన వర్గీయుల్లో నలుగురికి మంత్రి పదవులిచ్చాడు. అయితే ఈ ముచ్చట కూడా ఎంతో కాలం నిలవలేదు. బెరైటీస్ గనుల లీజు రద్దు చేయడం, రవీంద్ర రెడ్డిని మంత్రి వర్గం నుంచి తొలగించడం, వైఎస్‌కు అధిష్టానం నుంచి షోకాజ్ నోటీస్ ఇప్పించడంతో కథ మళ్లీ మొదటి కొచ్చింది. వైఎస కోట్ల మధ్య తిరిగి పచ్చగడ్డి భగ్గుమనే పరిస్థితి నెలకొన్నది.

ఇవన్నీ 1993 లో జరిగిన చేదు పరిణామాలు కాగా 1994 లో తిరిగి భూమి గుండ్రంగా వుందన్నట్లు రాజకీయ శక్తుల పునరేకీకరణ జరిగే సూచనలు కన్పిస్తున్నాయి. అన్ని దారులు రోమ్ నగరానికి వెళ్లినట్లు ఇప్పుడు అందరి దృష్టి కోట్ల అధికార పీఠం మీద పడింది. కోట్ల వారు కావాలని గిల్లి మరీ తకరార్లు తెచ్చుకుంటుండటంతో ఈ పరిస్థితి ఏర్పడింది. అందర్నీ దూరం చేసుకొని అధికారాన్ని నిలుపు కోవటం కష్టమన్న సంగతిని కోట్ల అంతరంగికులు గమనించి నట్లుంది వాళ్లు జనార్ధన రెడ్డితో తగాదా పడవద్దని కోట్లకు హితవు చెబుతున్నారట. గత మూడు నెలలుగా కోట్ల, జనార్ధన్‌ల మధ్య మూగనోము నడిచింది. తన సన్నిహితుల బలవంతం మీద ఇటీవల ముఖ్యమంత్రి స్వయంగా ఫోనులో జనార్ధన్ రెడ్డితో మాట్లాడాడు. కోస్తా జిల్లా ఎమ్మెల్యేలకు విందు ఇస్తున్నానని, తప్పకుండా విందుకు రావాలని ముఖ్యమంత్రి స్వయంగా జనార్ధన రెడ్డిని ఆహ్వానించారట. అయితే ఢిల్లీకి వెళ్తున్నందున విందుకు రాలేనని జనార్ధన రెడ్డి వినయంగా తిరస్కరించారట. ఆ తర్వాత నుంచి పరిస్థితి మళ్లీ మామూలే; ఎడమొహం - పెడ మొహం!

ఇలా వుండగా జనార్ధన రెడ్డి అంటేనే భగభగ మండే వై.ఎస్. వర్గీయులు కూడా ఇటీవలి పునరా

కొరవ 11 పేజీలో



నడిచే దైవం నిద్రపోయాడు!

## అతులిత యతి

(పరమపదించిన కంచి పరమాచార్యునకు శ్రద్ధాంజలి)

రసిక్

కంచి పెద్దస్వామి కైలాస పురి జేరి;
పరమపదము జేరె పరమ గురువు;
సకల శాస్త్ర విదుడు శాస్త్రసారము జేరి;
వేద వేద్యుజేరె వేద విదుడు

ఇట్టి వారొకరిద్దరి హితము కొఱకు
నింగి మబ్బులు క్రమ్మును, నేలపందు
వసుధ నున్నట్టి జనులకు వారి వలన
భుక్తి దొరుకును, దొరుకును ముక్తి తుదకు

శాంతి కర్మమ్ము వివరించు సాధువతడు
సర్వులకు మేలు గోరెడు సాధకుండు
నిష్ఠ ఆకృతి దాల్చిన నైష్ఠికుండు
నడుచు దైవమ్ముగా మన్న నడుదతండు

నిండు నూరేండ్లు బ్రతికిన పండుటాకు
రాలిపోవుట కాదు దిగ్భ్రాంతి కరము
అంతకాలమ్ము అతులిత యతి విధాన
భ్రాంతి కావల మనుటె విభ్రాంతి కరము!

# చెన్నారెడ్డికిది తగదు

తమిళనాడు గవర్నర్ డాక్టర్ మర్రి చెన్నారెడ్డి గారికి, ముఖ్యమంత్రి కుమారి జయలలితకు మధ్య జరుగుతున్న ప్రచ్ఛన్న యుద్ధం ప్రత్యక్ష సమరంగా మారింది. రాజ్ భవన్‌ను రాజకీయ రణరంగంగా మార్చి వినోద కాలక్షేపం చేస్తున్నారు చెన్నారెడ్డి గారు. ఆయన రాష్ట్రానికి గవర్నర్ హోదాలో వచ్చినప్పుడే జయలలితను పదవి నుంచి దించటం లేదా కనీసం ఏడ్పించడం అనే మహత్తర బాధ్యత భుజాన వేసుకొని వచ్చినట్లు విన్పడింది; ఇప్పుడాయన విధినిర్వహణ తీరు చూస్తె అది నిజమేనేమో నన్పిస్తోంది.

పదవి స్వీకరించినప్పటి నుంచి పేచీ తత్వమే అవలంబిస్తున్నారాయన. రాజ్‌భవన్‌ను ప్రత్యామ్నాయ అధికార కేంద్రంగా మార్చి నేరుగా ఉత్తర్వుల జారీ చేయడం, రాష్ట్రంలో రాజకీయ పర్యటనలు చేయడం వంటి కవ్వింపు చర్యలకు దిగారు. అసెంబ్లీ సమావేశపు ఉత్తర్వును తొక్కి పెట్టి, నిర్ణీత వ్యవధిలో శాసనసభ సమావేశం జరగకుండా రాజ్యాంగ సంక్షోభం సృష్టించే ప్రయత్నం చేశారు. ప్రభుత్వ ఉత్తర్వుల కాపీలు తనకు పంపాలని నేరుగా చీఫ్ సెక్రటరిని ఆదేశించి ప్రజా ప్రభుత్వ అస్తిత్వాన్ని ప్రశ్నార్థకం చేశారు. ఎన్నో ఫైళ్లను తొక్కి పెట్టారు. తమిళనాడులోని విశ్వవిద్యాలయాలకు వైస్ ఛాన్సలర్ల ఎంపికకు పంపిన మూడు పేర్ల జాబితాను సాంప్రదాయానికి విరుద్ధంగా తిరస్కరించి ప్రభుత్వాన్ని అవమానించారు. ముఖ్యమంత్రిని అవమానించే, ఆమె అధికారాన్ని సవాల్ చేసే ఇటువంటి సంఘటనలు చాలానే జరిగాయి.

జయలలిత కూడా కొద్ది కాలం ఓపిక పట్టింది. సహనానికి ఒక పరిమితి వుంటుంది కదా? అందులోనూ ఆమె స్వతంత్ర వ్యక్తిత్వం, ఎటిటిడిల వంటి పాశవిక శక్తినే ఎదిరించ గల్గిన సాహసం వున్న నాయకురాలు. ఓర్పు పరీక్షను ప్రక్కన పెట్టి ఆమె కూడా ప్రత్యక్ష సమరానికి పూనుకొన్నారు. అసెంబ్లీలో తనకున్న మెజారిటీతో గవర్నర్‌ను విశ్వవిద్యాలయ ఛాన్సలర్ పదవి నుంచి తొలగించి, ముఖ్యమంత్రిగా తాను ఆ బాధ్యత స్వీకరించారు. ప్రభుత్వాధికారులెవరూ గవర్నర్ ఆదేశాలు ఖాతరు చేయనవసరం లేదని, ఆయనకు అధికారిక కార్యక్రమాలు ఏర్పాటు చేయనవసరం లేదని ఉత్తర్వులు జారీ చేశారు. ఇప్పుడిద్దరి మధ్యా ఉప్పులో నిప్పులా వుంది. తమిళనాడులో ఏ పత్రిక తెరచి చూచినా ఈ తగవుల వార్తలే. ఇద్దరూ పంతంలో వున్నారు; పట్టుదలకు పోతున్నారు; ఎవరిది పై చేయి అవుతుందో నిరూపించి చూపాలన్న మూర్ఖంతో వ్యవహరిస్తున్నారు.

ఏ కోణం నుంచి ఆలోచించి చూసినా చెన్నారెడ్డి గారు చేస్తున్నది తప్పు అనే అన్పిస్తున్నది. గవర్నర్ గిరి కేవలం రాజ్యాంగ పరమైన లాంఛనం. కాని ముఖ్యమంత్రి ప్రజల చేత ఎన్నుకోబడిన ప్రభుత్వాధినేత. రాజ్యాంగం ప్రకారం చూసినా, ప్రజాస్వామ్య సాంప్రదాయాలను పరిశీలించినా ముఖ్యమంత్రి పై కత్తి పెత్తనం చేసే స్వతంత్రం గవర్నర్‌కు వుండను కాక వుండదు. అందులోనూ జయలలిత ప్రజాభిమానం గల్గిన నాయకురాలు. ఇప్పటికిప్పుడు ఆమె ప్రభుత్వాన్ని రద్దు చేసి ఎన్నికలు జరిపించినా, ఆమె తిరిగి అపరిమితమైన ప్రజాదరణతో అధికారంలోకి రాగలదన్న సంగతి విస్మరించకూడదు. అందువల్లే జయలలితను, ఆమె ప్రభుత్వ నిర్వహణ తీరును నిశితంగా విమర్శించే వారు కూడా గవర్నర్ చర్యలను నిరసిస్తున్నారు. ప్రజాస్వామ్య సిద్ధాంతాలకు ఆయన ప్రతిబంధకంగా వున్నారని లోకం కోడై కూస్తున్నది. అయినా




చెన్నారెడ్డి గారు తన ప్రవర్తన మార్చుకోవటం లేదు; తప్పు సరిదిద్దుకోవటం లేదు.

విపరీతమైన అధికార దాహం, అపరిమిత రాజకీయ వ్యామోహం గల్గి క్రియాత్మక రాజకీయాలలో నిమగ్నులై వుండే వారిని గవర్నర్ పదవుల్లో నియమించడం తప్పని ఇప్పటికెన్నిసార్లో రుజువైంది. ఇప్పుడా చరిత్ర మరింత వికృతంగా పునరావృతమౌతున్నది. ప్రధాని శ్రీ పి.వి. నరసింహా రావు చొరవ తీసుకొని, చెన్నారెడ్డి గారి స్పీడుకు బ్రేకులు వేయాలి.

లేకుంటే గవర్నర్ పదవి అనేదే వుండకూడదన్న వాదన ఒక ఉద్యమం వలె ఊపందుకుంటుంది. రిపబ్లిక్ దినోత్సవం రోజు ఈ పందెపు కోళ్లు రెండూ ఢీకొనసున్నాయని జరుగుతున్న సంఘటనలు సూచిస్తున్నాయి. పివి గారు ఆ లోపలే ఒక నిర్ణయం తీసుకోవడం అందరికీ శ్రేయస్కరం.

# ఆధ్యాత్మిక దీపం ఆరిపోయింది!

భక్తకోటిచే ప్రపంచ వ్యాప్తంగా ఆరాధింప బడిన మహాతపస్వి కంచి కామకోటి పీఠం పరమాచార్యులు శ్రీశ్రీశ్రీ చంద్ర శేఖరేంద్ర సరస్వతి స్వాముల వారు పరమ పదించారన్న వార్త ఆధ్యాత్మిక చింతన గలవారికి తీరని లోటు. తన బోధనలతో ఇటు ప్రాచీన, అటు ఆధునిక భావాల సమైక్యతకు వారధిగా కుల, మత, వర్గ విచక్షణలేని అభ్యుదయ పంథాలో ఆయన కొనసాగించిన బోధన అజరామరమైనది. పలువురు దేశాధినేతలు, పీఠాధిపతులు, మత ప్రవక్తలతో ప్రశంసలందుకున్న అపురూప వ్యక్తి, శక్తి ఆయన. పరమాచార్యకు నెల్లూరు జిల్లాతో దీర్ఘకాలపు సంబంధాలున్నాయి. జొన్నవాడ, వరిగొండ, నెల్లూరు రాజరాజేశ్వరి దేవాలయం, తుమ్మగుంట అయ్యప్ప క్షేత్రాలను సందర్శించి పావనం చేశారు. సమస్యలతో సతమత మవుతూ పీఠాన్ని సందర్శించే వారికి ఆయన ముఖారవిందాన్ని చూడగానే సమస్యలన్నీ తీరిపోయేవని ప్రతీతి. ఇహలోకంలో తనువు చాలించినా ఆ మహానుభావుడి బోధనలు కలకాలం వెలుగులు చిమ్ముతూనే వుంటాయి.

నెల్లూరు బి. పట్టాభిరామయ్య

### ఈ బంధం ఈనాటిది కాదు

నేను జమీన్‌రైతు పాఠకుణ్ణి. 1965 లో మా నాన్న గారు కీ.శే. శ్రీ పులుగుండ్ల రామమూర్తి నెల్లూరు స్టేట్ బ్యాంకులో పనిచేశారు. అర్ధంకిలో బ్యాంకు శాఖ ప్రారంభోత్సవం నాడు తొలిసారిగా నేను జమీన్‌రైతును చదివాను. ఆనాటి నుంచి అదొక అలవాటై పోయింది. బాంబుల శివారెడ్డి, సాయిబాబా లీలలు, పొందాయమ్మ చరిత్రలు జిల్లా బయట వున్నా మాకు తెలుస్తూనే వున్నాయి. నిత్యం ఎన్నో సమస్యలతో సతమత మవుతూ ఇంటికి రాగానే మలయమారుతంలా జమీన్‌రైతు మా వంటి ప్రవాస నెల్లూరీయులను సేద దీరుస్తుంది. అందువల్లే పత్రిక దిన దిన ప్రవర్థమాన మవ్వాలని మనసారా కోరుకొంటున్నాను.

-పులుగుండ్ల రంగారావు

హైదరాబాదు

## జనవాణి

### పూత మందులతో పరిష్కారం కావు

కొందరు స్త్రీలకు సెక్స్ అంటేనే భయం. అపోహలే అందుకు ప్రధానమైన పాత్ర వహిస్తాయి. భర్త సహకారంతో సెక్స్‌థెరపీ ద్వారా దాన్ని పరిష్కరించు కోవచ్చు. కానీ ఇటీవల కొన్ని పత్రికలలో వెలువడుతున్న సలహాల కారణంగా వీళ్లలో చాలా మంది రకరకాల పూత మందులు, కాంపోస్ వంటి మాత్రలు వాడుతున్నారు. ఇవి సమస్యలను పరిష్కరించడం అసంభవం. పైగా ఇటువంటి మందులు వాడిన వాళ్లలో సెక్స్‌థెరపీకి ఎక్కువ సమయం కూడా అవసరమవుతుంది.

-డా. ఇ. రాజగోపాల రెడ్డి

నెల్లూరు

### ట్రంకురోడ్డులో సహస్రాక్షుడు?

ఆనాడు ఇంద్రుడికి ఒళ్లంతా కళ్లంట. ఈనాడు ఆత్మకూరు బస్టాండు నుండి ఎసి స్టేడియం వరకు సాగే రోడ్డుకు కూడా ఒళ్లంతా కన్నే. ప్రజల ప్రారబ్ధం వల్ల లక్షల రూపాయలు ఖర్చయి పోతున్నా రోడ్డు బాగుపడడం లేదు. అది చాలక ద్వారాల పేరుతో రోడ్డుకు వళ్లంతా కన్నులు చేసిన నాయకుల చేతనే వీటిని పూడ్పించే ఏర్పాటును రోడ్లు భవనాల శాఖ చేస్తె బాగుంటుంది.

నెల్లూరు -ఎ. కవిత

### పోలీసు వ్యవస్థలో మార్పులు ఆవశ్యం

భారతదేశానికి శిరోభాగం వంటి పంజాబ్ రాష్ట్రంలో ఆ రాష్ట్ర పోలీసు అధిపతి శ్రీ కె.పి.ఎస్. గిల్ ఆధ్వర్యంలో, మానవ హక్కులు - భారత పోలీసు వ్యవస్థ అనే అంశం పై ఒక సదస్సు నిర్వహించారు. ప్రతి రాష్ట్ర ప్రభుత్వమూ ఇటువంటి

కొరవ 8 పేజీలో

## 50 ఏళ్ళ క్రితం ఈ వారం

14.1.1944

పేజీలు 6, వెల 0-1-6

### నెల్లూరు ముచ్చట్లు

#### అవీ- ఇవీ

తేది 10 వ ది చిత్తూరు సుబ్రమణ్యం పిళ్ల పాట కచ్చేరి పురమందిరాన ఏర్పాట్లు బాగున్నవి. అజన్మంగానైనా లైట్లుబాగా వెలిగినవి. ఆ పిళ్ళగారిది మంచి శారీర సంపత్తు, స్వచ్ఛమైన తెనుగు వాణ్కి అసమాన సంగీత విజ్ఞానము, ప్రకంసింప దగినవి.

కాని శాస్త్రుల వారి కవిత్వం మాదిరి తలదిరిగిన పండితులకే గాని "శిశుర్వేత్తి పశుర్వేత్తి" కి తలలూగ లేదు స్వామీ!

* * *

నెల్లూరు శానిటరి యిన్‌స్పెక్టరు కె.వి. కృష్ణరావు గారిని ఇన్నాళ్లకు బెజవాడకు మార్చారనే




[illegible]

మనకు సంపూర్ణ స్వరాజ్యం తమంతట తాము ఇంటికి తెచ్చియిస్తె ఎంతటి సంతోషమో, అంతకంటె మిక్కిలి సంతోషం గలిగింది.

ఎన్ని సంవత్సరాలగానో యీ మహాశయుడు నెల్లూరు మున్సిపాలిటీ వృక్షాన్ని పట్టుకొని భేతాళుడి లాగు వ్రేలాడుతూ ప్రజలకుచేసే చెడుపులు వేలా, లక్షలా, ఎన్నని చెప్పగలం? అంత గొప్ప కాంగ్రెసు మాతకు పెద్ద (ఎత్తైన) కొడుకైన ఎ.సి. సుబ్బారెడ్డి వంటి వ్యక్తి మాత్రం ఆ కలరా తగిలిన వ్యక్తి కేసులో విరుజేసిన అక్రమం ప్రత్యక్షంగా మిత్రుడు పి.టి. గోపాలాచారి సాక్షిగా చూచి గూడ ఏం చేయుగలిగినారు? ఈలాంటి వెన్నో?

ఈనాటికైనా యీలాంటి వ్యక్తిని మార్చగలిగిన అధికార వర్గానికి మా జోహారులు. కృష్ణరావు గారూ! అక్కడైనా ప్రజాసానుభూతి సంపాదించుకోవ దానికి ప్రయత్నిస్తారని ఆశిస్తున్నాం. వారికి బదులు వచ్చే ఓవాగేశరాయూ! తమరూగూడ ఇక్కడ చల్లటి చూపు చూస్తారని మా వాంఛ.

* * *

ఈ సంవత్సరం మొహరం, ముక్కోటి రెండూ హిందూ-మహమ్మదీయుల మాదిరి కొట్లాట కొంటూ ఒకే సమయంలో వచ్చినవి దుష్కారుకు. ఈ సందర్భంలో 144 సెక్షనొకటి రొప్పుతూ రోజాతూ పరుగెత్తుకుంటూ వచ్చింది. హిందువుల యిండ్లల్లో గూడా భజనలు వగైరాలు చేయ చేయగూడదంటూ నిషేధించడం వెలుగొవి. ఇండ్లల్లో గూడా నిషేధమా ఏమిటి తలతిక్కయాజ్ఞ.

కొరవ 8 పేజీలో

# నెల్లూరీయులను నీగ్రోలుగా మారుస్తున్న చక్కెర ఫ్యాక్టరీ!

నెల్లూరీయులను నీగ్రోలుగా మార్చాలన్న కృత నిశ్చయానికి కోవూరు షుగర్ ఫ్యాక్టరీ యాజమాన్యం వచ్చినట్లుంది. ఇదే పని మీద కాబోలు; గత సంవత్సరం వరికి పర్యటనకు పోయినప్పుడు సామంతు సుబ్బారెడ్డి ఏదో ఒప్పందంపై సంతకాలు చేసి వచ్చారనిపిస్తుంది. లేకుంటే ఫ్యాక్టరీ నుండి వెలువడే బూడిదకు గాలి మోటార్లు పెట్టి చిమ్నీ ద్వారా టౌన్‌పైకి వదలుతారా? దీని వల్ల వెంకటేశ్వరపురం మొదలు మదరాసు బస్టాండ్ వరకు ఏ చెట్టు, గోడలు, నీళ్ల తొట్లు చూసినా ఈ నల్లని బూడిదే! గతంలో ఫ్యాక్టరీలో మిగిలిన బూడిదను లారీలలో నింపి సుదూర ప్రాంతాలకు తరలించేవారు. ఫ్యాక్టరీకి లాభాలు ఎక్కువయ్యేసరికి ఆ పనికి ఫుల్ స్టాప్ పెట్టి ప్రజల ప్రాణాలు తీస్తున్నారు. బూడిద నల్ల బడలు బండ్లపై అమ్మే వస్తువులు తినేవారితో పాటు ఇండ్లలో నీటి ట్యాంకు మూతలు తీసేవారు పడరాని పాట్లు పడుతున్నారు. ఇక తెలియకుండా గాలి ద్వారాదాన్ని పీల్చుకుంటున్న మనం ఏ వ్యాధుల బారిన పడతామో శాస్త్రజ్ఞులు, డాక్టర్లు తెల్పి చెప్పాలి. ఏ సెంటర్‌లో నైనా జనోన్ని, ఆటో కోసం ఎదురు చూస్తూ నిలబడితే పది నిమిషాల్లో శరీరమంతా బూడిద మయమవుతున్నది. సుబ్బారెడ్డిగారూ, ఫ్యాక్టరీ లాభాలే కాదు; ప్రజలు పడే కష్టాలు కూడా చూడండి! లోపం సరిదిద్దండి.

## జర్నలిస్ట్ సుబ్బారావుకు విరాళాలు

సీనియర్ జర్నలిస్ట్ శ్రీ పత్రి సుబ్బారావును ఇటీవల ఘనంగా సన్మానించి 29,294రూపాయల పర్సును ఆయన అభిమానులు అందించారు. పుదార హృదయంతో

## నెల్లూరుసంగతులు

విరాళా లిచ్చిన వారు వీరు!

జిల్లా కుష్ఠునివారణాధికారి 1116, దేగా నారసింహారెడ్డి 1001, వొమ్మిన సుబ్రహ్మణ్యం 1001, నేదురుమల్లి జనార్దనరెడ్డి 1000 జె.వి రెడ్డి 1000, బెజవాడ పాపిరెడ్డి 1000, కొరిశపాటి గోపాలరెడ్డి 1000, ఎల్.వి కృష్ణారెడ్డి 1000, చంద్రభవన్ పరమేశ్వర్ 1000, నల్లపరెడ్డి ప్రసన్న కుమార్ రెడ్డి 1000, పెళ్లకూరు రామ చంద్రారెడ్డి 1000, నెల్లూరు నార్త్ రోటరీ క్లబ్ అధ్యక్షులు మరియు సభ్యులు కలిసి 750 లు. వీరేగాక ఎమ్మెల్యేలు కె. విష్ణువర్ధన్ రెడ్డి, సివి శేషారెడ్డి, రేబాల సుందర రామరెడ్డి, టంగుటూరు కృష్ణారెడ్డి, పోమిశెట్టి వెంకట సుబ్బయ్య, డిసి హరిబాబు, యర్లపల్లి శ్రీనివాస రావు, పోమిరెడ్డి చంద్రమోహన రెడ్డి, సీనియర్ అకౌంటెంట్ డిస్ట్రిక్ట్ ట్రెజరీ ఆఫీస్, తిక్కవరపు బలరామరెడ్డి, కొండా సత్యనారాయణ, మద్దాలి మల్లికార్జున రావు, సి.వి. సుబ్బయ్య ఐదు వందల లెక్కన, ఏ. కృష్ణమూర్తి రావు 301, ఎస్.ఎస్. రాయల్ రెడ్డి 300 అందజేశారు. వీరే గాక మరో 60 మంది కూడా 200 నుండి 50 రూపాయల వరకు ఇచ్చి అభిమానాన్ని చాటారు వారందరికీ తమ కృతజ్ఞతలు తెలియ జేస్తున్నారు సన్మాన సంఘం వారు.

## ఆర్యవైశ్య మహాసమ్మేళన్

వైశ్యులలో ఐక్యత, పట్టుదల 2 తేరి ప్రస్ఫుట మయ్యాయి. ముఖ్యంగా యువకుల్లో వుత్సాహానికి పట్ట పగ్గాలు లేకుండా పోయాయి. పూజా పునస్కారాల వంటి కార్యాలకు తప్ప, మరోచోట కనపడని మహిళలు కూడా కదలి రావడం చూస్తూంటే, బల ప్రదర్శన వెనుక ఏదో ఒక ' మిస్టరీ' వుందన్న విషయం ద్యోతక మయ్యింది. వుదయం 11 గంటల నుండి రాత్రి

కొరవ 10 పేజీలో

## సణుగుడు

* సత్యసాయి బాబా హత్యలు చేయించినా ప్రేమతత్వం ప్రబోధించినట్లు భావించాలా?
* జమీన్‌రైతుకు శేషన్ థ్యాంక్స్!

సత్యసాయి పట్ల నా భావాలకు, బాబా భక్తుల విశ్వాసాలకు మధ్య ఏర్పడిన బిభాభిప్రాయం జీడి పాకం లాగా సాగుతూనే వుంది; జిడ్డు లాగా అతుక్కొని వదలడం లేదు. నాకేమో ఆయన గారి గారడీ విద్యలు, ఘాతుక హత్యల గురించి కొత్త కొత్త సంగతులు తెలిసే కొద్దీ ఆయన పట్ల కంపరం పెరిగి పోతూ వుంది; భక్తులు మాత్రం లేఖాస్త్రాలతో నన్ను మార్చడానికి లేదా నోరు మూయించడానికి విడవకుండా పట్టి పీడిస్తూనే వున్నారు. పొద్దున పోస్ట్‌మ్యాన్ వస్తే - పాతిక భాగం జాబులివే! మరీ ఓవర్ లోడ్ చేసేస్తున్నానని చెత్త బుట్ట నన్ను శాపనార్థాలు పెడ్తున్నది. సాహిత్య పరిజ్ఞానం, లోక జ్ఞానం, అభ్యుదయ భావుకత్వం కల్గిన వ్యక్తిగత మిత్రులు శ్రీ పాకాల వెంకట కృష్ణయ్య రెండు అర ఠావుల్లో ఈ విషయమై నన్ను చీవాట్లు పెడుతూ ఒక సుదీర్ఘ లేఖ వ్రాశాడు. ప్రచురించకుండా ప్రక్కన పారేయకూడదన్న విజ్ఞప్తి కూడా చేశారు. అంతా అచ్చేయడం సాధ్యం కాదు - కృష్ణయ్య గారిని క్షమాపణలు కోరుతూ - కొన్ని భాగాలు మాత్రం ఇస్తున్నాను చదవండి-

"ఎవరో అన్నారనో - ఎవరో ప్రేరణో కాకుండా, స్వానుభవంతో బ్లిట్జ్ ఎడిటర్ కరంజియా చేసినట్లు జమీన్‌రైతు సంపాదకుడూ రాసి ఉంటే బాగుండేది. ఈ రచయిత కూడా పుట్టపర్తికి వెళ్లిన వాడే. ప్రతి అంశాన్నీ పరిశీలించి చూచిన వాడే. అక్కడ చెప్పుకొనే పిట్ట కథలన్నీ కట్టుకథలేనని తెల్సుకొన్న వాడే.

ఆయన మూర్తీభవత్ ప్రేమ; ద్వేషమెరుగని దైవం; కోపమెరుగని

## డోలేంద్ర

కారుణ్యమూర్తి. నిస్వార్థ సేవలో తరించమని అహర్నిశలు భక్తులకు హితం ఉపదేశించే నిష్కళంక దీప్తిస్వామి. ఆయన చేస్తున్న, చేయిస్తున్న సేవా కార్యక్రమాలు అన్నీ ఇన్నీ కావు.

రామాయణంలో పిడకల వేట అన్నట్లు రాపూరు నుండి శ్రీ డి.ఎల్. నరసింహం వ్రాసిన లేఖ ఒకటి జమీన్‌రైతులో చూశాను. శ్రీ సత్యసాయివి మాయలీలలు అని ఆయన పేర్కొన్నారు. లీలల విషయంలో పరమ హంస యోగానంద అనే బెంగాలీ యోగీశ్వరుడు రాసిన "The Autobiography of

కొరవ 7 పేజీలో

# దుగరాజ పట్నం పాలెగాండ్ల దౌర్జన్యాలతో నెల్లూరు జిల్లాకు అదృష్టం చేజారి పోయింది!

గత సంచిక తరువాయి

1626వ సం.లో సిరివి గల్గిన మన నెల్లూరు తీరం ఆంగ్లేయ వర్తకుల నాకర్షించింది. అప్పటికే అక్కడ డచ్చివారు తమ కార్ఖానాలు నెలకొల్పుకొని విరివిగా వర్తకం సాగిస్తుండినారు. గోల్కొండ నవాబు పోకడచేత తరచుగా పీడించ బడుతుండిన ఆంగ్లేయాస్టిండియా కంపెనీ వర్తకులు 1628 వ సం.లో మచిలీ పట్నంలోని తమ కార్ఖానాలు పూర్తిగా మూసివేసి, ప్రశాంత మండలంగా తీర్మానింప బడిన నెల్లూరు తూర్పు తీరాన గల అర్మగము (మోనాపోళము) అని పిలువ బడుచుండిన నేటి దుగరాజపట్నం గ్రామ సమీపంలోకి తమ కార్ఖానాలు తరలించారు. డచ్చివారిని చూచి ఆకర్షితులైన ఆంగ్లేయులు తమ కార్ఖానాలను వారి కార్ఖానాలకు అతి సమీపంలో నిర్మించు కొన్నారు. వ్యాపారులకు అవసరమైన రక్షణ భద్రతల దృష్ట్యా వీరి స్థలాన్ని ఎన్నుకొన్నట్లు భావించాలి. అయితే అక్కడ కూడా సమస్యలు తప్పలేదు కారని తీరంలోనే ఆంగ్లేయులు గ్రహించారు. పాలెగాండ్ల బెదడలు చాలా ఎక్కువగా వుండేవి. అచ్చట సముద్రం కొంచెం బయలుగా వుండి ఓడలు నిలుపు కొనడానికి అనుకూలించ లేదు. పైగా చుట్టుపట్ల నిత్యం కలహించు కొనే పాలకుల నుండి వీరికాశించినంత సహకారాధి మానాలు లభించలేదు. ఆ కారణంతో వీరు కోస్తా వెంబడి దక్షిణ దిశగా వున్న అనేక నదీ ముఖద్వారాలను పరిశీలింప సాగిరి. ఫ్రాన్సిస్‌డే అనే వాణిజ్య నౌకాశ్రయ శోధకుడు 1639 వ సం.లో కూవం (కూవము) నది ముఖద్వారాన్ని చాలా చిన్నదైనప్పటికీ అత్యంతాను కూలాశ్రయంగా నిర్ణయించారు. తీరం వెంట సముద్రంలో గుట్టలు (Corals) ఎక్కువగా లేకపోవడం, నదీ ముఖద్వారం బల్ల పరుపుగా వుండి ఓడలు నిల్పుకొనుట కనువుగా వుండడం, అప్పటికే కొందరు ఐరోపీయులు అచ్చట తమ కార్ఖానాలు నెలకొల్పుకొని వాణిజ్యం సాగించు చుండడం, ముఖ్యంగా ఆ ప్రాంతంలో ప్రజలు శాంతికాముకులు, కష్టజీవులు కావడం గమనించిన ఫ్రాన్సిస్‌డే తమ కంపెనీకి ఈ కూవపు తీరమే అత్యంతనువైన స్థలమని నిర్ణయించాడు. ఈ చుట్టుప్రక్కల పల్లెవాసులు - మైలాపూరు, తిరువళ్ళిక్కేణి, ఆది (మదరాసు) పట్నం - ఆంగ్లేయులకు సహకరించడాని అంగీక రించారు. ఆ ప్రాంతీయుల సలహామేరకు విజయనగర వారసుడైన చంద్రగిరి యువరాజు నుండి ఫ్రాన్సిస్‌డే కూవం తీరంలో తమకు కావలసిన మేరకు స్థలసేకరణ చేయడంతో 1639-40 లో ఆంగ్లేయాస్టిండియా కంపెనీకి స్థిరనివాసమైన చెన్నపట్నం తెలుగు తీరం చివర దక్షిణ భాగంలోను, అట్లే తమిళ తీరం ఉత్తరపు చివరన కూవం తీరంలోను నెలకొన్నది. దీనివల్ల నెల్లూరీయుల బృహదదృష్టం జారి పోయింది గాని క్రొత్తగా నెలకొన్న చెన్నపురి (సెయింట్ జార్జి కోట) లో బహు సంఖ్యాకులు దుగరాజపట్నం నుంచి వచ్చిన నెల్లూరీయులే!

ఉత్తరాన ఎలంబేడు, దక్షిణాన అడయేరు మధ్యలో కూవము అనబడే మూడు నదుల ప్రదేశాన్ని ముతరాసు చెన్నప్పపట్టణ ప్రాంతంగా పేర్కొని సర్ ఫ్రాన్సిస్‌డే అనే ఆంగ్లేయాస్టిండియా కంపెనీ ఏజెంటుకు 1639 వ సం.లో విజయనగరం వారి తరఫున తత్కాలీయాధి కారియైన దామర్ల వెంకటాద్రి నాయకుడు దత్తం చేసినట్లుగా దామర్ల వారి వారసుడనని చెప్పుకొన్న బంగ్ల రామస్వామి నాయుడు 1820 లో తెల్పారు. వెన్వెంటనే అర్మగాములో వున్న వాణిజ్య, వర్తక, కార్ఖానాలను వాటి సిబ్బందితో సహా చెన్నపట్నానికి తరలించిన ఆంగ్లేయులు సెయింట్ జార్జి కోట నిర్మాణాన్ని ప్రారంభించారు. ఆ తర్వాత చాలా దశకాల వరకు తెలుగు వారు ఆంగ్లేయులకు తమ సద్భావ సహకారాల నందించు చుండేవారు.

విజయ నగర సామ్రాజ్యపు చివరి రోజుల్లో, అంటే 17 వ శతాబ్ది ప్రథమార్థంలో, దాని పతనానికి పూనుకొన్న క్షుద్రరాజులకు, సంస్థానాధీశులకు మన వెంకటగిరి పూర్వపు పాలకుడైన యాచమ నాయకుడు నేతృత్వం చేపట్టి సైన్యాన్ని సమకూర్చుకొని, తమ ఎదురు మురాకు నాయకుడైన జగ్గరాయునిని కావేరి నదీ సమీపంలో వున్న తోపూరి వద్ద ఓడించి, అతని సోదరుడైన ఎతిరాజులుతో స్నేహ ఒప్పందం కుదుర్చుకొని, సహకారానికి కానుకగా ఎతిరాజులును పులికాటు ప్రాంతానికి పాలకునిగా నియమించి ఆ ప్రాంతానికి 'ప్రలయ కావేరి' అని నామకరణం చేశారు. ఈ సమయంలో పులికాటు వద్ద డచ్చి వారి గల్డ్రియా అనే కోట స్థావరాన్ని, పోర్చుగీసు వారు పులికాటు ఏలుబడిలోని దక్షిణ ప్రాంతమైన అదయేటి వద్దున వున్న సాన్‌థోము అనే వాణిజ్య-వర్తక-కార్ఖానా కోట స్థావరాన్ని నెలకొల్పుకొని ఎతిరాజునకు అనేక ఇబ్బందులు పెట్టారు. ఈ కాలంలో పులికాటు సీమలో చాలా శ్రీమంతులు, విజయనగర పాలనా యంత్రాంగాన్ని బాగా జీర్ణించు కొన్నవారైన వర్తక శెట్టు (శెట్టి?) లిద్దరుండేవారు. వీరి పేర్లు మల్లోశెట్టి మరియు చిన్నశెట్టి. విజయనగరపు చివరి తరం రాజుల మన్ననలను వంశపారం పర్యంగా పొంది పులికాటు

కొరవ 10 పేజీలో

## చెన్నపురిలో నెల్లూరీయత

ప్రొఫెసర్ ఎం. అచ్చిరెడ్డి
ఎం.ఎ. పి.హెచ్.డి.

# నూరేళ్లు నిండిన వెంకటగిరి నటసమాఖ్య!

కళల కాణాచియైన వెంకటగిరి నాటక రంగానికి నూరేళ్లు నిండాయి. ఈ నిండు నూరేళ్ల నాటక రంగం వర్ధిల్ల దానికి కారణ భూతులైన ఎందరో కళాకారులు, కళాభిమానులు, కళాప్రియులు కాలగర్భాన కలసి పోయినా వారికి వేదిక కల్పించిన 'నట సమాఖ్య' మాత్రం బ్రతికే వుండి ఈ సంస్థ శతాబ్ది ఉత్సవాలు ఘనంగా జరిపి తిరిగి పూర్వపు వైభవాన్ని ఒకసారి గుర్తుకు తెచ్చారు. 30 తేదీ జరిగిన ఈ ప్రత్యేక కార్యక్రమానికి రాష్ట్ర గృహ నిర్మాణ శాఖ మంత్రి శ్రీ పసల పెంచలయ్య, శ్రీమతి నేదురుమల్లి రాజ్యలక్ష్మమ్మ, సినీ దర్శకుడు డాక్టర్ శివప్రసాద్ ముఖ్య అతిథులుగా విచ్చేశారు. నట సమాఖ్య అధ్యక్షుడు శ్రీ జి. సీతారామయ్య అధ్యక్షత వహించారు. సాంప్రదాయ బద్ధంగా జ్యోతి ప్రజ్వలనానంతరం శ్రీమతి రాజ్యలక్ష్మమ్మ మాట్లాడుతూ గర్వించ దగ్గ కళాకారుల జన్మభూమి వెంకటగిరి కావడం గొప్ప విషయ మన్నారు. మంత్రి శ్రీ పసల పెంచలయ్య ప్రసంగిస్తూ ఒక దేశ నాగరికతను, ఒక జాతి సంస్కృతిని ప్రతిబింబింప జేసేవి కళలే నన్నారు. కళల పురి, సాహిత్యాల సిరి, సంగీతలహరి వెంకటగిరి అని డాక్టర్ శివప్రసాద్ ప్రస్తుతించారు. ఆంధ్ర నాటక రంగానికి, వెంకటగిరి నాటక రంగానికి ఒకేసారి నూరేళ్లు నిండడం గొప్ప విషయ మన్నారు. నట సమాఖ్య నిర్విరామ కృషికి చేయూత నందించిన మహానుభావులకు అధ్యక్షులు శ్రీ జి. సీతారామయ్య కృతజ్ఞతలర్పించారు. పలు కళా ప్రదర్శనలను విజయ వంతంగా నిర్వహించిన ప్రస్తుత ప్రధాన కార్యదర్శి శ్రీ వి. నారాయణ బాబును ఈ సందర్భంగా సత్కరించారు. చివరన శ్రీ కె. బాలకృష్ణ వందనాలు చెప్పారు.

## రాపూరులో కోడి పందాల జోరు

పండుగలు పబ్బాలకు చాటు మాటుగా జరిగే కోడి పందాలు రాపూరులో నిత్యకృత్యమై పోయాయి. పెద్ద చెరువు, ఈదుల చెరువు, తూర్పు అగ్రహారం కట్ట ఈ పందాలకు అనువైన స్థలాలుగా పెలు గొందు తున్నాయి. మండల పరిధిలోని అన్ని గ్రామాల నుండే గాక కడప జిల్లా నుండి పందెపు కోళ్లను చంకన బెట్టుకొని

## జిల్లా వార్తలు

రాపూరులో బస్సు దిగేవారు ఇటీవల ఎక్కువై పోయారు. వందల స్థాయిలో జరిగే పందాలు వేల స్థాయికి చేరుకొన్నాయి. రాపూరు ను కోడి పందాల కేంద్ర స్థానంగా చేయాలని తలచారేమో పోలీసులు... దాడి చేయడం, కేసు పెట్టడం వంటి పనులను పొరపాటున కూడా చేయడం లేదని ప్రజల ఘోష.

## కాంగ్రెస్ భక్తుని మరణం

వెంకటగిరిలో కాంగ్రెస్ భక్తుడన తగిన కార్యకర్త శ్రీ డి. చెంచు కృష్ణయ్య(40) గత వారం క్షయ వ్యాధితో మరణించాడు. 1978 ఎన్నికల నుండి ఇటీవల ఎన్నికల వరకు చెంచు కృష్ణయ్య పార్టీ అభ్యర్థుల విజయానికి అవిరళ కృషి చేస్తూ, తిండి తిప్పలు మాని పని చేసేవాడు.

## గూడూరులో నేత్రదానం

రెండు వారాల క్రితం గూడూరులో ఆవిర్భవించిన నేత్రదాన సంస్థ అప్పుడే రెండవ నేత్రాన్ని సేకరించ గల్గింది. 23 తేదీ హృద్రోగంతో కన్ను మూసిన శ్రీ పిడ్డారెడ్డి గోపాలరెడ్డి నేత్రాలను వారి కుటుంబ సభ్యుల ప్రోత్సాహం మేరకు డాక్టర్లు సి.ఆర్. రెడ్డి, ఎమ్.సి. నరసింహాలు స్వీకరించారు. ఈ అపురూప కార్యక్రమంలో అల్లూరు ఆది శేషారెడ్డి, వాకాటి సుబ్బరామి రెడ్డి, ఎన్.వి. కృష్ణారెడ్డి, నేత్రదాన సంస్థ సభ్యులు పాల్గొన్నారు.

## దామవరం రెడ్‌రోజ్ అసోసియేషన్

దగదర్తి మండలంలో దామవరం గ్రామంలో రెడ్‌రోజ్‌యూత్ అసోసియేషన్ ఇటీవల ప్రారంభయ్యింది. చైతన్యం గల గ్రామం, అభివృద్ధి ధ్యేయంగా దీన్ని స్థాపించారు. నెహ్రూయువకేంద్రం అనుబంధంగా నడుపుతారట. అసోసియేషన్ అధ్యక్షుడుగా టి. వెంకటేశ్వర్లు, వుపాధ్యక్షుడుగా కె. శ్రీనివాసులు, కార్యదర్శిగా పి. చంద్రశేఖర నాయుడు, సహ కార్యదర్శిగా ఎం. గణేష్, కోశాధి కారిగా జె. వెంకటేశ్వర్లు రెడ్డి ఎన్నికయ్యారు.

## కలిచేడు స్కూళ్లు - ఒక వివరణ

కలిచేడు స్కూళ్లు చెడిపోతున్నాయని గతవారం జమీన్‌రైతులో వచ్చిన వార్తకు తలుపూరు, కలిచేడు పాఠశాల ఉపాధ్యాయులు ఒక వివరణ పంపారు. ఫలితాల విషయంలో గత రెండు సంవత్సరాలుగా పదవ తరగతిలో 60, 56 శాతాలు సాధిస్తే; ఏడవతరగతిలో 95, 96 శాతాలు సాధించారట. జిల్లాసైన్సు ప్రదర్శనంతో పాటు 77 వ గ్రిగ్ పోటీలలో కూడా తమ విద్యార్థులు చాలా మంది ప్రైజులు సంపాదించారట. ఇటు చదువులు, అటు ఇతర రంగాలలో పిల్లలు జాగ్రత్తగా మెరుగు పరుస్తున్న తమ స్కూళ్ల పై ఎవరో స్వార్థపరులు, అసూయపరులు మాకు పంపారని వారి ఆవేదన.

## చక్కెర కోటా

జనవరి నెలకు విడుదలైన లెవీ చక్కెరతోపాటు నిల్వవున్న దానిని కూడా పండుగల సందర్భంగా పంపిణీ చేస్తారట. మునిసిపల్ పరిధిలోనికి వచ్చే పట్టణాలతో పాటు పాత తాలూకా కేంద్రాలలోని రోజా రంగు కార్డుల వారికి 5, తెలుపు కార్డులకు 2 కిలోలిస్తారు. ఇతర గ్రామీణ ప్రాంతాలలో రోజా రంగు కార్డుల వారికి 3 కిలోలు, తెలుపు రంగు కార్డుల వారికి 1 కిలో ఇస్తారట. సంక్రాంతి పండుగ వైభవం అంతా కనబడే పల్లెల్లోని వారికి నామ్‌కే వాస్తే గా కేజీ చక్కెర ఇస్తే ఏమి వుపయోగ ముంటుంది జెసి గారూ?

కావలిలో ఇండియన్ బ్యాంకు శాఖను ప్రారంభిస్తున్న రీజినల్ మేనేజర్ కె. సూర్యనారాయణ, చెన్నారెడ్డి పెంచలు రెడ్డి, కేతిరెడ్డి రామకోటారెడ్డి, నెల్లూరు మేనేజరు, కావలి మేనేజరు ఎ. చెంచయ్య

# గోగులపల్లి రోడ్డు నిధులు మురిగిపోతున్నా ఎవరికీ పట్టదేమి?

అన్నీ వున్నా అల్లుడి నోట్లో శని అన్నట్లుంది అల్లూరు మండలం గోగుల పల్లి గ్రామస్తుల పరిస్థితి. గోగుల పల్లి వరకు మూడు కిలో మీటర్ల తారు రోడ్డు పని మంజూరు కావడం, పూర్తయి పోవడం జరిగింది. ఉప్పు ప్రధాన పరిశ్రమగా, జీవనాధారంగా కల్గిన ఈ గ్రామంలో కొటార్ల వరకు రోడ్డు వేయక పోవడం వల్ల వేసిన మూడు కిలోమీటర్ల రోడ్డుకు ప్రయోజనం చేకూరదని ప్రజలు అధికారులకు పలు విధాలా అభ్యర్థనలు పంపారు. దీనికి స్పందించిన అధికారులు మరో మూడు లక్షల రూపాయలు మంజూరు చేశారు. కాంట్రాక్టర్ అగ్రిమెంట్ కుదుర్చు కోవడంలో చూపిస్తున్న వుదాసీన వైఖరివల్ల ఈ పనికి ప్రస్తుతం ఫుల్ స్టాప్ పడింది. మార్చి 31 తేదీ సమీపిస్తుండడం వల్ల నిధులు మురిగి పోయే అవకాశం వాకిట ముందుంది. ప్రజా సంక్షేమం దృష్ట్యా అధికారులు రోడ్డు పని మొదలు బెట్టించ వలసిన అవసరం ఎంతైనా వుంది.

## కావలిలో ఇండియన్ బ్యాంకు

కావలిలో ఇండియన్ బ్యాంక్ శాఖను రీజినల్ మేనేజర్ శ్రీ కె. సూర్యనారాయణ ప్రారంభించారు. మాజీ శాసన సభ్యుడు చెన్నారెడ్డి పెంచలు రెడ్డి అధ్యక్షించారు. జిల్లాలో ఇది మూడో బ్యాంకు శాఖని మేనేజర్ శ్రీ ఎ. చెంచయ్య చెప్పారు. కావలి ప్రజలు, వ్యాపారస్తులు తమ సేవలు విరివిగా వుపయోగించు కోవాలని ఆయన విజ్ఞప్తి.

## అల్లూరు పోలేరమ్మ వైభవం

అల్లూరు పోలేరమ్మ తిరునాళ్ల 12 తేదీ వైభవంగా జరిగింది. ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన విద్యుత్ అలంకరణలు, పుష్పాలంకరణ, తెనాలి బ్యాండు కచ్చేరి విశేషంగా ఆకర్షించాయి. ఇటీవల గ్రామంలో జరిగిన గొడవలను పురస్కరించుకొని రికార్డు డాన్సులు, దురాచారమైన మాతమ్మల చిందులు వేయ కుండా నిషేధిస్తూ కలెక్టర్ చేసిన వుత్తర్వును పోలీసులు అతి ప్రయాస మీద అమలు పరచ గలిగారు. కాని బ్రాందీ షాపులను తెల్లవార్లూ ఎక్సైజ్ కాపలాతో, డైమండ్ డబ్బాలను పోలీసుల సహకారంతో చక్కగా నడిపారు.

## నెల్లూరు ముచ్చట్లు

విశ్వకర్ముడు

### మంత్రులు

13 తేది ఉదయం జిల్లా మంత్రి శ్రీ పెంచలయ్య ఫార్మినార్‌లో, డిప్యూటీ మంత్రి శ్రీ కటికి యానాది రెడ్డి నారాయణాద్రిలో దిగారు. పండగ సెలవుల కాలక్షేపం. 15 తేది రాత్రికి తిరిగి వెళ్ళవచ్చు.

### కావలి ఆర్‌డిఒ బదలీ

కావలి ఆర్‌డిఒ శ్రీమతి వాణి ఉకేసను రంగారెడ్డి జిల్లా హౌసింగ్ డిఎంగా బదలీ చేశారు. ఆమె వచ్చి ఏడాదిన్నర కూడా కాలేదు. ఐతే ఆమె తొలి పోస్టింగ్ కూడా. వయసులో చిన్నదైనప్పటికీ కర్తవ్య అధికారిణిగా పేరు తెచ్చుకున్నారు. జవహర్ భారతి కాలేజిలో జరిగిన నిధుల స్వాహా పై ఆమె దర్యాప్తు జరపడంతో, పెద్ద పేర్లు బయటకు వస్తాయని భయపడి, బదలీ చేయించారని అనుమానం.

### పొగమంచు

వారం నుంచి జిల్లా అంతా పొగమంచు కురుస్తూంది. సూర్యుడు మరీ బద్ధకిస్తున్నాడు. ఏడుగంటల వరకు నిద్రలేవడం లేదు. మాగాణి పైర్లకు ఈ మంచు మంచిదే. జనమే చలితో ముడుక్కుని పోతున్నారు.

### కిసాన్ మేళ

నెల్లూరు రైస్ రీసర్చ్ స్టేషన్, పశువైద్య కాలేజీలు కలిసి 21, 22 తేదులలో ముత్తుకూరులో కిసాన్ మేళ నిర్వహించ బోతున్నారు. పైర్లు, పంటలతో పాటు చేపల, రొయ్యల పెంపకం పై కూడా సదస్సు, చర్చలు, పోటీలు వుంటాయి. రైతులు పెద్దసంఖ్యలో హాజరు కావాలని డాక్టర్ పి. రాఘవ రెడ్డి పిలుస్తున్నారు.

### పట్టాభిరామరెడ్డి జయంతి

స్వర్గీయ రేబాల పట్టాభిరామ రెడ్డి 83 జయంతి 20 తేది సాయంత్రం టౌన్‌హాల్ రీడింగ్ రూంలో జరుగుతుంది. శ్రీ వేలమూరి రామమూర్తి గారు భగవత్ తత్వం - మోక్షం అనే అంశం పై ప్రసంగించి శ్రీమతి రేబాల సుజాతమ్మ నుంచి సన్మానం స్వీకరిస్తారు. వర్తమాన సమాజం ఆధ్వర్యంలో జరుగుతుంది సభ.

### మళ్లీ దోపిడీలు

ఏడాదిపాటల లేకుండా వుండిన దోపిడీలు మళ్లీ మొదలైనాయి. 12 తేది వేకువన కావలి దగ్గర బెంగుళూరు విజయవాడ ఆర్‌టిసి బస్సు దోచుకున్నారు - రెండు లక్షలు పోయింది; అదే రోజు అర్ధరాత్రి నార్తు రాజుపాలెంలో శ్రీ కృపానందం అనే రిటైర్డ్ టీచర్ ఇంట్లో దొంగలు పడి 15 సవర్ల నగలు దోచుకున్నారు.

ఎస్‌పి గారూ - పోలీసులకు హారా హుషార్ చెప్పండి!

### పొట్టి శ్రీరాములు

అమరజీవి పత్రిక సంపాదకుడు శ్రీ తుమ్మల రామసుబ్బారెడ్డి పొట్టి శ్రీరాములు విగ్రహ స్థాపనకు సంబంధించి హైదరాబాదు నుంచి నెల్లూరు వరకు చాలా బాధలు పొందారు. వివరాలు పై వారం.

### నెల్లూరు బజారు

| | | |
|---|---|---|
| మొలగొలుకులు | 9672 | 3,400/- |
| | 9674 | 3,800/- |
| మిన్నాలు | | 3,000/- |
| ఐ.ఆర్. 56 | | 2,800/- |
| బంగారు సవర (8గ్రా) | | 3,520/- |
| వెండి (10 గ్రా) | | 68/- |

## పోలీసులే చంపారు

(మొదటి పేజీ తరువాయి)

ఎదిరించిందో కోసం పొడుచుకొని వచ్చి నట్టుంది- ఆ పురుషోత్తముడికి; ఇంట్లో వంట చేసు కొంటుండిన శేషమ్మను జుట్టు పట్టి వీధిలోకి ఈడ్చి, చీర విప్పి పారేసి చితక బాదాడట. నిస్సహాయురాలైన ఆ స్త్రీ పై ఆ నీచుడు ఎక్కడ లేని ప్రతాపం ప్రదర్శించి, పొయ్యి వెలిగించు కోవడానికి పెట్టివుండిన పూదురు గట్టం తీసుకొని, ఆమె రొమ్ములపై కొడుతూ వినోదించాడట. పైన చెప్పిన మహిళా మణులు ముగ్గురు కూడా ఈ వినోద కార్యక్రమంలో పాలు పంచు కొన్నట్లున్నారు. ఆమె తాళి కూడా తెంపి పారేశారట.

ఇంత ఘోరం జరుగుతున్నా షాజహాన్ రౌడీ ఇజానికి జడిసి చుట్టు ప్రక్కల వారెవ్వరూ శేషమ్మను కాపాడ డానికి ప్రయత్నించలేదు. దానితో ఆమె రూరల్ పోలీస్ స్టేషన్‌కు వెళ్లి ఎస్‌ఐ శ్రీ జయరామ సుబ్బారెడ్డికి విన్న వించింది. కానీ ఆయన ఆమె ఇచ్చిన ఫిర్యాదును చింపి బుట్టలో పారేశాడు. ఆ సాయంత్రం షాజహాన్, అతడి సోదరి కలిసి పోలీసుకు ఫిర్యాదు చేసినందుకు శేషమ్మ ఇంటి పైకి దండెత్తి వచ్చి తిట్టి వెళ్లారట. రాత్రికి వారు తన నేమి చేస్తారోనని భయపడిన ఆమె మరో సారి స్టేషన్‌కు ఎళ్లి ఎస్‌ఐకి విన్న వించింది. అయిన ఒక కానిస్టేబిల్‌ను పంపి షాజహాన్‌ను స్టేషన్‌కు రప్పించారట.

అదే ఆమె జీవితానికి చరమ గీతం పాడిన దుర్ఘటన అయ్యింది. వన్‌టౌన్ పోలీసు స్టేషన్‌లో షాజహాన్‌కు బంధువైన బాషా అనే కానిస్టేబిల్ ఒకరు వున్నాడట. అతడు వచ్చి, షాజహాన్‌ను క్షణాలలో విడిపించాడు. వారిద్దరూ బయటకు వచ్చి శేషమ్మను బండ బూతులు తిట్టారట. 10 తేది ఉదయం కూడా దుర్భాషల తంతు కొనసాగు తుండడంతో మళ్లీ శేషమ్మ ఎస్.ఐ వద్దకు వెళ్లి తన గోడు వినిపించింది. కానిస్టేబిల్ పలుకుబడి ప్రభావమో ఏమో గాని ఎస్‌ఐగారు శేషమ్మను వినరాని తిట్లు తిట్టి, తరిమేశారట. ఆమె రోదిస్తూ ఇంటికి తిరిగి వెళ్తుంటే షాజహాన్, షబ్బీర్ అనే అతడి మిత్రుడు ఆమెను రంగనాయకులపేట రైల్వే గేటు దగ్గర నిలేసి, ముఖాన ఉమ్మి నీచంగా తిట్టి, నలుగురి ఎదుటా పైట పట్టుకొని లాగి గేలిచేశారట. ఆమె తిరిగి స్టేషన్‌కు పరుగెత్తుకుంటూ వెళ్లి ఎస్‌ఐతో కన్నీళ్ల పర్యంతంగా తనకు రక్షణ కల్పించమని కాళ్లు పట్టుకొని బ్రతిమ లాడిందట. ఆ సమయంలో షాజహాన్ స్టేషన్ ఎదుటే వున్నట్లున్నాడు. ఆడదనే కనికరం కూడా లేకుండా ఎస్‌ఐగారు ఆమెను మళ్లీ తిట్టారట. తమ కళ్లముందు ఆమెకు జరిగిన పరాభవం షాజహాన్‌లో పశుత్వాన్ని ప్రేరేపించింది. ఆ నీచుడు తన మిత్రుడితో కలిసి ఆమెను స్కూటర్‌పై వెంబడిస్తూ, రోడ్డు పొడుగునా తిడుతూ, ఉమ్మేస్తూ, పైట లాగుతూ పోలీసు తమనేమీ చేయరని అరచి చెప్తూ ఇంటి వరకు తరుముకొని వచ్చాడట. ఇంత పెద్ద జనారణ్యంలో పులి బారిన పడిన లేడిలా ఆ అభాగ్య యువతి ఏడుస్తూ రోడ్లో పరుగెత్తుతుంటే కాపాడిన వారు లేరు. తనకిక రక్షణ లేదనే నిస్పృహతో, తననెవరూ కాపాడ లేరనే నిర్వేదంతో, మనసు తూట్లు పడగా, హృదయం భగ్గు మనగా ఏమి చేయలేని నిస్సహాయతతో ఆమె పరుగు పరుగున ఇంటికి వచ్చి, ఇంట్లో వుండిన తన కూతురును బయటకు పంపి, తలుపు వేసుకొని, వంటిపై కిరోసిన్ చల్లుకొని, నిప్పంటించుకొన్నది. ఇంట్లో నుంచి పొగల రావడం చూసిన చుట్టు ప్రక్కల వారు కేకలు పెట్టే టప్పటికి దూరంగా సెంటర్‌లో వుండిన ఆమె కుమారుడు వచ్చి, తలుపు పగుల గొట్టి, తల్లిని బ్రతికించు కోవడానికి విఫల ప్రయత్నం చేశాడు. ఆ ప్రయత్నంలో ఆ పిల్లవాడి ముఖం కూడా కాలిపోయింది. అందరూ చేరి ఆమెను ఆస్పత్రికి తరలించినా ప్రయోజనం లేక పోయింది. చని పోయే ముందు ఆమె సెకండ్ అడిషనల్ మేజిస్ట్రేట్ శ్రీ సీతారామరాజుకు జరిగిన కథంతా పూస గుచ్చినట్లు వర్ణించి చెప్పి కన్నుమూసింది. ఆమె మరణ వాఙ్మూలం ఇచ్చే సమయంలో, ఆమె పన్నెండేళ్ల కుమార్తె ప్రక్కనే వుండిన ఎస్‌ఐ కాలర్ పట్టుకొని, ఏడుస్తూ, "నువ్వే మా అమ్మను చంపావు" అని నిలదీసిందట. మనసనేదే లేని ఆ బండరాతి హృదయుడు ఆ పసి బిడ్డను విదిలించు కొని వెళ్లి పోయాడట.

ఈ కేసు విషయమై ఎటువంటి చర్యాలేదు. కనీసం షాజహాన్‌ను ఈ వార్త వ్రాసే సమయానికి (12 తేది రాత్రి) అరెస్టు కూడా చేయలేదు.

ఇంత ఘోరం, దారుణం జరిగిన తర్వాత కూడా పోలీస్‌ను సరే ప్రక్కన బెట్టండి- కనీసం దోషులనైనా పట్టి జైలులో పెట్టలేని నికృష్ట స్థితిలో వుందా పోలీసు యంత్రాంగం? సిగ్గు చేటు కాదా ఇది? ఎస్‌పి గారూ- ఒక నిర్భాగ్య, నిరుపేద మహిళ విషాద మరణానికి కారణ భూతులైన వారి పట్ల, నిర్దాక్షిణ్యతతో వ్యవహరించిన ఆ సబిన్స్‌పెక్టర్ పట్ల మీరైనా క్షణం ఆలస్యం జరగకుండా తగిన చర్య తీసుకోండి; లేకుంటే సభ్య మానవ సమాజమే సిగ్గుతో చితికి పోవలసిన ఈ దుర్ఘటనలో మీరూ నిందితులౌతారు.

## సణుగుడు

(4 పేజీ కొరవ)

a Yogi" అనే పుస్తకం చదివితే మన వంటి వాళ్లకు ఎంతో ఆశ్చర్యకరమైన విషయాలు తెలుస్తాయి. మనవంటి వాళ్లం నమ్మలేం కూడా. అయినా అవి కల్తీ లేని నిజాలు; యోగులకు సైజాలు. నూతన వస్తు సృష్టి యోగికి సుసాధ్యమే అంటారాయన. పతంజలి యోగశాస్త్రంలో యోగసిద్ధుల ప్రస్తావన ఉంది. వీళ్లందరూ ఆధ్యాత్మిక విద్యలో ఆరితేరిన వాళ్లు. మనలాగా అబద్ధాలు అరటిపండులో అంటి వేసిన వాళ్లు కారు. స్వానుభవాలను ముందు తరాల వారికి గ్రంథీకరించిన వాళ్లు.

మరి మనం? పొట్టకూటికి తెచ్చుకొన్న పట్టాను పట్టుకొని ఇంతకంటే సుజ్ఞానం మరొకటి లేదని విర్రవీగే వాళ్లం. ఆధ్యాత్మిక విద్యలో ఓనమాలైనా దిద్దకుండానే ఆక్షేపణలకు దిగుతాం. ప్రయోగాలు చెయ్యకుండానే పరాచకా లాడతాం.

శ్రీ సత్యసాయి తనను గూర్చి ఇట్లా అంటారు.

"I am unique, incomparable, Equal to myself alone - I am my own witness and authority" పై మాటల పైన దృఢమైన విశ్వాసం ఉన్న వాళ్లు ఆయన భక్తులు. ఎవరెన్ని అన్నా, ఎందరెన్ని రాసినా - చాలా కాలంగా అంటున్నారు, రాస్తున్నారు కూడా - భక్తుల విశ్వాసం చెక్కు చెదరదు. ఎందుకంటే వాళ్ల విశ్వాసానికి పునాది వాళ్ల ప్రత్యక్ష అనుభవాలే.

చివరగా ఒక మనవి; ఎవరి విశ్వాసాలు వారివి. ఒకరి విశ్వాసాలలో మరొకరు వేలు పెట్టకుండా ఎవరి పని వాళ్లు చూసుకుంటే ఎంత ఆరోగ్యకరం?''

ఇంకొకరి విశ్వాసాలలో వేలు పెట్టడం నా ఉద్దేశ్యం కానేకాదు. సత్యసాయి బాబా భక్తి మానమని నేనేమీ ఉద్బోధించడం లేదు. కాని ఘాతుక హత్యలు చేయించిన ఒక వ్యక్తిని; తన పడక గదిలో నాలుగు శవాలు నెత్తుటి మడుగులో తేలియాడితే, నీళ్లు పెట్టి ఆ మరకలు కడిగించి, అసలేమీ జరగనట్లు బొంకిన కల్లా ప్రేమతత్వం ప్రబోధించను తయారైన ఒక కిరాతక మనస్కుడ్ని క్రిమినల్‌గా బోనెక్కించి విచారించ వలసింది పోయి దేవుడిగా ఆరాధిస్తున్న మన దౌర్భాగ్యం మీద, మన పాలనా వ్యవస్థ మీద, మన వాయుకుల పైన అక్రోశం అపుకోలేక పోవడమే నా బలహీనత.

సత్యసాయి నిలయంలో ఆ కాళరాత్రి జరిగినవి నిజంగా హత్యలేనని, సత్యసాయి, ఆయన ట్రస్టు సభ్యులు వాటిని కప్పెడుతున్నారని దిన పత్రికలు ఘోషిస్తున్నాయి. ఈ హత్యలలో వారికి ప్రత్యక్ష లేదా పరోక్ష సంబంధం వుందని సిబి సిఐడి విచారణలో రుజువైన సంగతి లోకానికంతా తెలిసింది. పోలీసులు ఆ నలుగురినీ గదిలో బంధించి, తాళ్లతో కట్టి పడేసి, చిత్రహింసలు పెట్టి, చివర్న పాయింట్ బ్లాంక్ రేంజిలో కాల్చి చంపినట్లు సాక్ష్యాలు లభించాయి. చంపిన ఆ పోలీసులే - వీరిని చంపినందుకు తమకు రాష్ట్రపతి బహుమానం లభిస్తుందని చెప్పి, తమ చేత కాల్పులు జరిపించారని కోర్టుముందు వప్పుకున్నారు. ఆ సర్కిల్ ఇన్స్‌పెక్టర్ హత్యల తర్వాత బెంగుళూరు వెళ్లి నాటు బాంబులు, మందు గుండు సామగ్రి కొని తెచ్చి, అతడు ప్రశాంతి నిలయంలో పెట్టి, నేరం శాంతారాం, ప్రభులపై మోపినట్లు వెల్లడైంది. తన నేరం బయట పడి నప్పటినుంచి ఆ ఇన్స్‌పెక్టర్ పరారీలో వున్నాడు. ప్రశాంతి నిలయంలోని ఒక గదిలో తలదాచుకొని వున్నట్లు అనుమానం. కేసులో నిందితులుగా సిబి సిఐడి పేర్కొన్న పోలీసులను కోర్టు రిమాండ్‌కు పంపింది; మొదట్లో బెయిల్ నిరాకరించింది. డిఫెన్స్ న్యాయవాదులను సత్యసాయి స్వయంగా ఎంపిక చేసినట్లు వినికిడి.

నిజాలు, నేరాలు ఒకటొకటిగా వెల్లడి అవుతుండడంతో సత్యసాయి అత్యవసరంగా కేంద్ర హోం మంత్రి శ్రీ ఎస్‌బి చవాన్‌ను పుట్టపర్తికి పిలిపించారు. మూఢత్వంతో కళ్లు పొరలు కమ్మిన ఆ ఛాందసుడు బాబా కాళ్ల దగ్గర కూలబడి, ఆయన ఆదేశాలను హిస్ మాస్టర్స్ వాయిస తరహాలో వ్రాసుకున్నాడో ఏమో తెలియదు కాని - ఆయనటు పోగానే సత్యసాయి నిలయం హత్యల కేసు విచారిస్తున్న సిబిసిఐడి డిఐజిని రాత్రికి రాత్రి ఆ పదవి నుంచి తొలగించారు. కేసు దర్యాప్తుతో సంబంధమున్న అధికారుల నందరినీ బదలీ చేశారు. వారికి సహకార మందిస్తుండిన అనంతపురం ఎస్‌పిని మార్చిపారేశారు. ఆఖరకు ప్రాసిక్యూషన్ న్యాయవాదుల పై కూడా వత్తిడి తెస్తున్నట్లు చెప్తున్నారు.

సత్యసాయి నిజంగా ఏ తప్పు చేయకుంటే ఈ బదలీలన్నీ ఎందుకు జరిగినట్లు? దేశమంతా సంచలనం సృష్టించిన ఒక కిరాతక హత్యల కేసును మాఫీ చేయడానికి అంత ఉన్నత స్థాయి నుంచి ఎందుకు ప్రయత్నం జరుగుతోంది? ప్రభుత్వంలోని నేతలు, అధికారులు ప్రజలకెందుకు నిజాలు చెప్పడం లేదు?

ఇంత జరిగిన తర్వాత కూడా సత్యసాయిని దేవుడిగా నన్ను ఆరాధించమంటారా? హత్యలు చేయించినా ప్రేమతత్వం ప్రబోధించినట్లు భావించమంటారా? అంతటి హీన స్థితికి నేను దిగజారలేను; దిగజారను కూడా!

ఇదే విషయమై గూడూరు నుండి మా పాఠకుడు శ్రీ అవుల కొండయ్య వ్రాసిన లేఖలోని ఒక భాగాన్ని వినిపించి ముగిస్తాను-

"ఆది శంకర భగవత్పాదుల వారు వ్రాసిన భజగోవిందం చదివితే అర్థమౌతుంది; వేషాలు వేసే వారు సద్గురువు కాదని ఆయన చెప్తారు. శంకరుని కంటే గొప్పవారెవరున్నారు?

* * *

శేషన్ ఏమిటి, జమీన్‌రైతుకు థ్యాంక్స్ చెప్పడమేమిటని ఆశ్చర్య పోవద్దు. డిసెంబరు 10 తేది ఇదే శీర్షికన శేషన్ గారిని చూచి ఐఎఎస్ అధికారులు బుద్ధి తెచ్చుకోవాలని వ్రాసిన లఘు వ్రాతను గూడూరు పాఠకులు శ్రీ అవుల కొండయ్య ఇంగ్లీషులోకి అనువదించి శేషన్‌కు పంపారు. అది చదివి ఆయన థ్యాంక్స్ చెప్తూ రెండు లైన్ల జాబు వ్రాశారు. ఆయనకు నేను థ్యాంక్స్ చెప్తున్నాను.

## అవమానం

(12 పేజీ కొరవ)

అన్నా వదినలది ఆదర్శ దాంపత్యమని, లక్ష్మీ పార్వతి పతివ్రతా శిరోమణి, త్యాగమూర్తి అని కీర్తించారందరూ! రేణుకా చౌదరి, లక్ష్మీ పార్వతిని సంబోధిస్తూ 'మా అన్నగారిని మీరే పదేళ్ల పాటు కాపాడాలని' విన్నవించారు. ఎన్టీఆర్ వెంటనే ఆమెను పిల్చి, నూరేళ్లు కాపాడుతుందని చెప్పమన్నారు.

వీరి ప్రసంగాలు జరుగుతున్నంత సేపు ఎన్టీఆర్, లక్ష్మీపార్వతిలు అంత జనాన్ని వదిలేసి, తమలో తాము ముచ్చట్లాడు కుంటుండినారు. మధ్యలో ఎవరో వచ్చి ఏదో చెప్పబోతే చిరాకు పడ్డారు ఎన్టీఆర్. శ్రీమతి లక్ష్మీ పార్వతి ప్రసంగం, హరికథా కాలక్షేపం వలెనే వుండింది. స్త్రీ అనేది లేకుంటే సృష్టి అనేదే లేదు తల్లిగా, చెల్లిగా, భావ వల్లిగా, కల్పవల్లిగా వివిధ రూపాలలో దర్శన మిచ్చే శక్తి స్వరూపిణి స్త్రీ. క్లియోపాత్ర, ఎలిజిబత్ టేలర్ వంటి స్త్రీలు చరిత్ర కెక్కారు. అదే విధంగా స్త్రీలు తమను తాము సంస్కరించుకోవాలి. ....... సాగిందామె ప్రసంగం. మధ్యమధ్యలో స్వీయ కవితా గానం కూడా చేశారు.

ఆమె ప్రసంగం మధ్యనుంచే వున్న కొద్దిపాటి జనం కూడా లేచి వెళ్ల నారంభించారు. పోలీసులు, కార్యకర్తలు ఎంత ఆపినా ఆగలేదు. మైకుల్లో ప్రకటన చేసినా ఫలించలేదు. ఆమె మధ్యలోనే మాటలాపి కూర్చున్నారు. నిజానికి ఆమె ఏమి మాట్లాడుతున్నదో అర్థం కాక జనం కదలనారంభించారనవచ్చు. అప్పటికి ఎన్టీఆర్ ఉపన్యసించలేదు. అది ఆయనకు అవమానంగా తోచింది. ఆయన ముఖం కందగడ్డ వలె మారి పోయింది. నాలుగే నాలుగు నిముషాలు ముక్తసరిగా మాట్లాడి దిగేశారు. అదీ కాంగ్రెస్‌ను తిట్టడం వరకే పరిమితం. ఆయన ప్రసంగం మధ్యలోనే స్టేడియం ఖాళీ అయిపోయింది.

ఎన్టీఆర్‌కు ఎందుకింత అవమానం జరిగింది? నాయకులు చెప్పిన జన సమీకరణ ఏర్పాట్లన్నీ ఏమైనాయి? మనకే కాదు- తెలుగు నాయకులకే ఈ ప్రశ్నలకు సమాధానాలు దొరకడం లేదు. జిల్లా నాయకులందరూ ఎన్టీఆర్ దృష్టిలో పడడానికి కటౌట్లు, బ్యానర్లు కట్టుకోవడం; గోడలపై వ్రాసుకోవడానికే తమ దృష్టినంతా కేంద్రీకరించారు. ఒక్క చంద్రమోహన్‌రెడ్డి, కొద్ది వరకు నల్లపరెడ్డి ప్రసన్న కుమార్ రెడ్డి తప్ప పట్టుమని పది ట్రాక్టర్ల నిండా జనాన్ని తీసుక రాలేక పోయారు. ఇతర జిల్లాల నుంచి జనాన్ని తోలడం అలివయ్యే పని కాదు. భౌగోళికంగా నెల్లూరు రాష్ట్రంలో ఒక మూల విసిరేసి నట్లుండడమే దీనికి కారణం. తెలంగాణా జిల్లాల నుంచి ఒక ఎమ్మెల్యే ఒక్క బస్సులో, జనాన్ని తెస్తే 30 వేలు ఖర్చయిందట. ఆ లెక్కన ఇంత పెద్ద సదస్సుకు లక్షల సంఖ్యలో సమీకరించడం సాధ్యమయ్యే పనేనా? జమ్మల మడుగు నుంచి స్వర్గీయ శివారెడ్డి సతీమణి మాత్రం నాలుగైదు బస్సులు తెచ్చినట్లున్నారు. ఆమె రాకే సదస్సుకొక ఆకర్షణ. ముందు ఆరు జీపుల్లో తుపాకులు పట్టుకున్న అనుచరులు, తన టాటా మొబైల్‌లో సాయుధులైన పోలీసులు, వెనుక ఒక ఎస్కార్ట్ వ్యాన్, ఆ తర్వాత నాలుగు జీపుల్లో స్వంత సైన్యం ...... ఆమె రోడ్లో వస్తుంటే ఏదో దండ యాత్రకు వచ్చినట్లే వుండింది.

జనం రాకపోవడం సదస్సుకు ఒక లోపమైతే, వారిలో మహిళల సంఖ్య పదవ వంతు కూడా లేకపోవడం మరీ అవమానకరం. దానికి తగ్గట్లే ఇది సదస్సని మర్చిపోయి, బహిరంగ సభగా మర్చేశారు. మహిళల సమస్యలపై మాట్లాడిన వారేలేరు. మహిళలకు తెలుగు దేశం ఏమి చేసిందో, ఏమి చేయనుందో చెప్పిన వారు లేరు.

జనంలో కూడా ఎన్టీఆర్ ఉపన్యాసం వినాలన్న ఆసక్తి కన్పించలేదు. శ్రీమతి లక్ష్మీ పార్వతిని చూడాలన్న ఉద్దేశ్యంతోనే వచ్చినట్లున్నారు వారు; ఆమెను చూసి వెళ్లి పోయారు - అంతే! స్టేజి మీద వారిద్దరూ జనాన్ని మర్చిపోయి ముచ్చట్లాడుతుండిన దృశ్యం ప్రజల దృష్టిని దాటిపోలేదు. తిరిగి వెళ్లే వారి వ్యాఖ్యానాలు వింటే- ప్రజలలో ఎన్టీఆర్ పట్ల ఇంత ఏవగింపు, ఈసడింపు వుందా అన్పించింది. దానికి తగ్గట్లే వుండిందాయన ప్రవర్తన. ఉదయం నుంచి, రాత్రి తిరిగి రైలెక్కే వరకు కొత్త పెళ్లి కూతురును విడిచి వుండలేని పడుచు పిల్లవాడి వలె ఆయన ఆమె భుజంపై చేయి తీయకుండా పొదివి పట్టుకొని తిరగడం చూసే వారికి ఎబ్బెట్టుగా వుండింది. అమెరికాలోనే ఇంగ్లండులోనో దంపతులిట్లా వుంటే సహజం కావచ్చు. అది మన తెలుగు సంస్కృతి కాదు కదా? ఎన్టీఆర్ రాజకీయ చరిత్రకు ఈ కృతి మించిన ప్రేమ కలాపమే ఎప్పుడో ఒక రోజు చరమ గీతం పాడుతుందేమో!

సదస్సు తర్వాత ఎన్టీఆర్ జిల్లా నాయకుల తలవాచే చివాట్లు పెట్టారు. వ్యక్తిగత ప్రచారానికి సమయం వృధా చేయడం తప్ప సదస్సును విజయవంతం చేయడానికి ఎవరూ పనిచేయలేదని చీవాట్లు పెట్టారు. తర్వాత 9 తేది హైదరాబాదులో కూడా ఒక సమీక్షా సమావేశం పెట్టి తిట్టారు. ఈ చీవాట్లు, శాపనార్థాలు పత్రికల కెక్కడంతో సదస్సు వైఫల్యం చెందిందన్న వార్తను ఎన్టీఆర్‌గారే స్వయంగా రాష్ట్రమంతటికీ తెల్పినట్లయింది.

నిజానికి నెల్లూరు జిల్లా స్థాయిలో చూస్తే సభ అంత పేలవంగా ఏమీ జరగలేదు. బ్రహ్మాండం కాక పోయినా, బాగానే వుండింది. కాని రాజమండ్రి సదస్సులతో పోల్చి చూస్తేనే, రాష్ట్ర స్థాయిలో ఆలోచిస్తేనే ఫెయిల్యూర్ అవుతుంది.



### గూడూరు డి.ము. వారి కోర్టులో

S.C. No. 94 / 92

పినాకినీ గ్రామీణ బ్యాంక్, గూడూరు -వాది

తెల్లి నల్లయ్య శెట్టి
S/o. అరివేలు శెట్టి పోటిపాళెం గ్రామం గూడూరు మండలం, నెల్లూరు జిల్లా

#### నోటీసు

వాది మీ పై లోను బాకీ రాబట్టు నిమిత్తం పై కోర్టులో దావా వేసి ఉన్నది. దావాను కోర్టు వారు 20.1.1994 తేది. మీ నోటీసు నిమిత్తం వాయిదా వేసినారు. మీకు ఆక్షేపణలు ఉన్న యెడల, మీరు గాని, మీ తరఫున వకీలు ద్వారా గాని అభ్యంతరము తెలుప వలసినది. లేనిచో మీ పరోక్షములో తీర్మానించెదరు.

పి.వి. సాయికుమార్ రెడ్డి
వాది తరఫున న్యాయవాది

## నంద్యాల సబ్ జడ్జి కోర్టులో

S.C. 109/93

ఎస్. మునిరెడ్డి -వాది

Vs

బి. లక్ష్మన్న -ప్రతివాది

### సమన్ ప్రకటన

పై నంబరు దావాలోని వాది ప్రతివాది అయిన నీ పైన దావా ప్రాంసరీ నోటు బాకీ మొత్తం బాకీకి దావాను దాఖలు చేసి యుంటున్నారు. న్యాయమైన ఆక్షేపణలున్న యెడల పై కోర్టు వారి యెదుట 28.1.1994 తేదీ ఉదయం 10 గంటలకు హాజరై నీ ఆక్షేపణలను తెలుపు కొనవలసినది. లేనంతట కోర్టు వారు పరోక్షమందు Expart చేయుదురని యిందు మూలముగా తెలియ జేయడమైనది.

పి. రామయ్య.

వాది పరం అడ్వొకేటు, నంద్యాల

## ది నెల్లూరు కో ఆపరేటివ్ అర్బన్ బ్యాంక్ లిమిటెడ్

నం 2319 రు ఫోన్: 26536

### ప్రకటన

అందుమూ మున తెలియజేయడ మేమనగా నెల్లూరు నవాబు పేట మెయిన్ రోడ్డు మునిసిపల్ వార్డు నం 1 రు. పాత డోరు నం 481రు. క్రొత్త డోరు నం 123A రు. కాపురస్థుడు లేట్ రాఘవులు శెట్టి కుమారుడు గుండ్లపల్లి రాధాకృష్ణయ్య ఈ బ్యాంకు నందు ఆయకపు అప్పు కోరుచూ వారి స్థిరాస్తి తాలూకు రిజిష్టరు డాక్యుమెంటు నం. 2087/73 రు. సంబంధించు హక్కు, విడుదల పత్రము పబ్లిక్ కాపి దాఖలు చేసి ఒరిజనల్ పత్రము పోయినదని తెలుపు చున్నారు. ఇందుకు సంబంధించి చూపుదు అడుమానములు గాని, ప్రోనోటు బాకీలుగా గాని లేక ఏ యితర బాకీలు, హక్కులు, అభ్యంతరములున్న యెడల బ్యాంకు వారికి ప్రకటన తేది నుండి 10 రోజుల లోపల వ్రాత మూలకముగా తెలియజేయ కోరడమైనది.

ఆస్తి షెడ్యూలు

నె.డి.రి. యిలాకా నెల్లూరు మున్సిపాలిటిలో చేరిన నెల్లూరు టవున్ నవాబుపేట మెయిన్ రోడ్డు మునిసిపల్ వార్డు నం. 1 రు. పాత డోరు నం. 123A, రు క్రొత్త డోరు నం 481 రు గల మిద్దె యిల్లు వగైరాలకు హద్దులు: తూర్పు: గోనుగుంట లక్ష్మయ్య యింటి ప్రక్క మా సొంత దారి, దక్షిణం: మున్సిపల్ రోడ్డు, పడమర: గురుమూర్తి, టీచర్. సందు వెంబడి మా సొంత గోడ, ఉత్తరం: నారాయణ సింగ్ యింటి గోడ.

యీ హద్దులలోని సుమారు 431/2 అం. స్థలములో 12 అం. మిద్దె యిల్లు, 8 అం. సిమెంటు రేకుల యిల్లు. యీ ఆస్తికి సంబంధించిన సకల యీజామెంటు హక్కులు.

A.P.R. రాజా J.C.S. అమరనాథ్

కార్యదర్శి అధ్యక్షులు

# శివారెడ్డి పద్యాలు

### కులాలు - మతాలు

అవిలోన సృష్టి అంకురించినరోజు
నరుడు పుట్టినట్టి నాటి దినము
మతము కులము లేదు మధ్య గల్పించారు
వంత వచ్చినారు అందియూకు!

తప్పు జేసినోళ్లి దండిస్తె శిక్షిస్తె
బహిష్కరిస్తె యెవరు బాధపడరు
అంక్షపెట్టి జాతినంతట్ని వెలివేస్తె
వూరుకోరు చట్టమొప్పుకోదు!

పంటపెట్టి నిన్ను పండించి ధాన్యాన్ని
రాశిపోసినాడు మోసకొచ్చి
కూటుగట్టినోడు కులహీనుడయ్యాడు
కట్టకడకు ఏమి ఖర్మఫలమొ!

వృక్షమొకటె దానికున్న శాఖలు వేరు,
పనులు వేరు వేరు పాలువొకటె,
దేవదేవుడొకడె దేవాలయాలేరు
మతములన్ని వొకటె మార్గమేరు!

జాతివివక్షత యెంతో
పాతకమని చాటుతారు, పైన యిదేంటి
చేతకు మాటకు తేడా!
లోతుకు దిగజూకు కన్నులొట్ట బోద్దిరా!

పత్రికల్లో రోజు ప్రకటిస్తు వుంటారు
రేడియోల్లో పంబరేపుతారు
మాటలంత వరకె మతపిచ్చిపోలేదు
నాయకులకు యీ వినాయకులకు!

పుణ్యభూమిమంది, భూలోక స్వర్గమ్ము
భవ్యచరిత జనని భరతమాత
అంటరాని వాడు ఆవిర్భవిస్తాడు
యిండియాలో భరత ఖండమందు!

కులము ముఖ్యమైతె కృష్ణుండు గొల్లింట
అవతరించు పెండ్లి యాడబోడు
జాంబవతిని, యింద్రజాలమ్ము యిది అంతు
నమ్మబోకు తోలు బొమ్మలాట

మంత్రముంది సూది మందుంది, మా కుంది
తీర్థముంది పాము తేలు కుడితె
జాతిమత విభేద జాడ్యము నరికట్ట
మందులేదు వేయి మాటలేల!

## జనవాణి

(3 పేజీ కొరవ)

సదస్సులకు ప్రోత్సాహం ఇవ్వాలి. పోలీసులు సక్రమంగా సేవలందిస్తున్నారని కితాబు నిచ్చే మంత్రులు ఎక్కువై పోతున్నారు. పోలీసులూ మానవ మాత్రులే; కాదనము. కానీ ఇటీవల వారిలో పెరిగి పోతున్న స్వార్థం, అధికార లాలసత్వం, వృత్తి రీత్యా వారిని దిగజార్చి మానవ హక్కులు కాలరాచి వేయడానికి తద్వారా పోలీసు వ్యవస్థ పరువు దిగజార్చేందుకు దోహద పడుతున్నాయి. పంజాబ్ సదస్సులో వాస్తవ, అవాస్తవాల పై యదార్థ చర్చలు జరిగాయి. పరిష్కార మార్గాలు సూచించబడ్డాయి. ప్రతిరాష్ట ప్రభుత్వం ఇటువంటి సదస్సు నిర్వహిస్తె ఒకింత మార్పు వస్తుందని ఆశ.

నెల్లూరు -బి.వి. సమత

### ఆర్యవైశ్యులందరినీ సమీకరించ లేక పోయారు

జిల్లా ఆర్యవైశ్య మహాసమ్మేళన్ జనవరి 2 తేది టౌన్‌హాలులో జరిగింది. ఒక్కొక్కరికి టిక్కట్ 20 రూపాయల వంతున కొనుగోలు చేసి సమ్మేళనాన్ని తిలకించేందుకు సకుటుంబ సమేతంగా వెళ్లాను. ఏర్పాట్లు మాత్రం భారీగానే చేశారు. కాని ఆర్యవైశ్యులందరినీ సమీకరించడంలో విఫలమయ్యారు. జిల్లాలో దరిదాపులు 2 లక్షల మంది ఆర్యవైశ్యులుంటే కేవలం 2 వేల మంది మాత్రమే సమ్మేళనానికి హాజరయ్యారు. సదస్సులో పాల్గొన్న నాయకులు ఆర్యవైశ్యులు ఎదుర్కొంటున్న సమస్యలు, వాటి పరిష్కార మార్గాల గూర్చి ఆలోచించక జిల్లా పేరు మార్పు, సారా వుద్యమం తీరు తెన్నుల పై అనర్గళ వుపన్యాసాలిచ్చారు. ఇంతకు మునుపు 76 లో విజయవాడలో రాష్ట ఆర్యవైశ్య మహాసభ జరిగినపుడు నిరుపేద వైశ్యుల అభ్యున్నతికి ఒక బ్యాంకు ఏర్పాటు చేస్తామని తీర్మానం చేశారు. అది నేటికి కార్యరూపం దాల్చలేదు. రాజకీయాలలో రాణించాలంటే ప్రజా సేవ ముఖ్యం; ఆర్భాటాలు, సన్మానాలు, డిస్కో డాన్సులకు ఓట్లు రావు. ముందుకు సాగలేరు.

నెల్లూరు -పి. వెంకట సుబ్బయ్య

### టౌన్ సి.ఐ.కి అభినందనలు

జనవరి 1 తేదికి స్వాగతం పలుకుతూ టౌన్‌లో నానా రకాల అరాచకాలు సృష్టించే వారి ఆటలకు టౌన్ సి.ఐ. తీసుకొన్న ముందు జాగ్రత్తల వల్ల అడ్డుకట్ట వేయబడ్డాయి. 31 తేది రాత్రి 9 గంటలకే సి.ఐ. స్వయంగా బార్లు, హోటళ్లు, కేకుల షాపులు మూయించడం వల్ల గొడవలు లేకుండా పోయాయి. మంచి పనిచేసిన సి.ఐ.ని అభినందిస్తున్నాను. త్రైరీ లాటరీల విషయంలో మాత్రం ఆయనెందుకో వెనకడుగు వేస్తున్నారు.

నెల్లూరు -గునుపాటి వేణుగోపాల్

### మహిళా సదస్సు విఫలమైంది

గతవారం నెల్లూరులో జరిగిన రాష్ట తెలుగు మహిళా సదస్సు అట్టర్ ప్లాఫ్ అయ్యింది. అన్నగారి పిలుపు నందుకొని మహిళలు తండోప తండాలుగా వస్తారన్న ఆశ నిరాశయ్యింది. మహిళలకు తన పార్టీ అధికారంలోకి వచ్చాక చేసే పనులు వెల్లడిస్తానన్న అధి నాయకుడు సదస్సులో ఏ విషయమూ చెప్పక పోగా; పాత విషయాలను అరిగిపోయిన రికార్డులా మళ్లీ వల్లె వేశారు. గౌరవ ప్రదమైన వయస్సు, ప్రజా నాయకుడు అన్న విషయం మరచి పోయి స్టేజి పైకి ఎక్కేందుకు లక్ష్మీపార్వతి పైన చేతులు వేసుకొని రావడం, ఆమె గారు పతివ్రతా ప్రసంగాన్ని చేయడం సదస్సుకు హాజరైన కొద్దిపాటి మహిళలు కూడా ఈసడించు కొన్నారు. స్టేజి పై మహిళలకు ఇచ్చిన గౌరవం అందరికీ తెలుసు. ఇటీవల జరిగిన మూడు సదస్సులు విజయవంత మయ్యాక ఎన్టీఆర్ పట్ట పగ్గాలు లేకుండా వ్యవహరిస్తున్నారు. అధినాయక భజన తప్ప మరొకటి లేని పార్టీ నాయకునికి మగవాళ్లు తగిన బుద్ధి చెప్పక పోయినా మహిళా మణులు ఆ పని చేసినందుకు సింహపురి మహిళగా గర్వపడుతున్నాను.

నెల్లూరు -పి. అరుణమ్మ

### సారా వార్తలు మానండి

సారా వ్యతిరేక వుద్యమం మొదలైన తొలి దినాల్లో పత్రికలన్నీ ఆ వార్తలతో సారా కంపు కొట్టాయి. మహిళా శక్తి మూలంగానే సారా నిషేధిస్తె తమ మూలంగా అది జరిగిందని ఒక పత్రిక బాకా వూదుకొన్నది. ఆ సమస్య అంతటితో సద్దు మణిగిందంటే ఇటీవల కల్తీ సారా కంపు వార్తలు పతాక శీర్షికన చేరాయి. నాయకుల తిట్లతో పాటు ఎన్ని రకాల సారా, ఏ రుచిలో ఎక్కడెక్కడ లభిస్తుంది; అది ఇచ్చే కిక్కు, దాని ముద్దు పేర్లతో సహా వస్తున్న దిక్కు మాలిన వార్తల వల్ల సమాజానికి ఏ రకమైన మేలు జరుగుతుందో అర్థం కావడం లేదు. సారా మాని ప్రభుత్వం ఐ.ఎం.ఎఫ్.ఎల్. వ్యాపారం చేస్తున్నది. దాని ధోరణి మారదు. అందువల్ల పత్రికా సంపాదకులంతా ఒకసారి ముఖ్యమంత్రి ఇతర వున్నతాధికార్లతో సమావేశం ఏర్పాటు చేసుకొని సూచనలు చేసి ప్రభుత్వ విధానాన్ని మార్చండి. అంతే కాని దయచేసి పత్రికల నిండుగా సారా వార్తలతో సరి పుచ్చకండి.

-ములుమూడి నరసింహరావు

సికింద్రాబాద్

## 50 ఏళ్ళ క్రితం

3 పేజీ కొరవ

నెల్లూరు సౌత్‌స్టేషన్ అలాబలా లేని ప్రదేశము. దానిలో ఇప్పుడున్న స్టేషన్ మాస్టరు గారికి మన ప్రపంచము, మన భాష తెలిసినట్లు కనిపించదు, కస్సుమంటారు.

9వ తేది మధ్యాహ్నం కొండాయపాళెంనుండి ఒక కుర్రాడు వచ్చాడు 3 గం. బండికి తలమంచికి పోవడానికి. అతను ఉత్తరాన్నుండి వచ్చిన బండిలో దిగినాడని అనుమానించి చెంప పగిలి పోయ్యేట్లు ఒక దెబ్బ గొట్టి అతని జేబిలోవున్న అర్ధ రూపాయ డబ్బులు వదల గొట్టాడట ఒక వ్యక్తి. ఆ కుర్రాడు ఏడుస్తూ వచ్చిన దారి పట్టేడు పాపం! ఈ ఉదంతాన్ని ఒంగోలునుండి ఆ మధ్యాహ్నం బండిలో దిగి ప్రత్యక్షంగా చూచిన ఒంగోలువాసి విజయపురి వెంకటనర్సయ్య అనే వ్యక్తి మాకు వ్రాస్తున్నారు. ఈ నిర్వాకమని ఎవరు జేశాడో తెలియదుగాని ఈ స్టేషన్ మీద అప్పుడప్పుడు కంప్లైంట్లు మాత్రం వస్తుంటవి. స్టేషన్ మాస్టరు వారు కొంచెం గుర్రాన్ని దిగి ఈలాంటివి విచారించి తగు కట్టుదిట్టం జేస్తె బాగుంటుందని మా సలహా.

-విమర్శకుడు

## ముఖ్యవార్తలు

### సైకిళ్ల గజదొంగ

మద్రాసు ప్రక్క ఏచూర్‌లో మధురై అనే వ్యక్తిని అరెస్టు చేశారు. అతనివద్ద 40 దొంగ సైకిళ్లు దొరికినవట.

### చెంచులక్ష్మి రివ్యూ

అహోబిల నారసింహుడు చెంచుపడుచును పెండ్లాడిన పౌరాణిక గాథ ఇది.

తెలుగులో యిదివరకు ఎన్ని ఫిలిములు తీసినా, 18 వేల అడుగులకు గవ్వ తక్కువైనా ఒప్పుకోలేదు. 11 వేల అడుగులలో తెలుగు చిత్రం యెట్లా తియ్యటం? అని చాలా తర్జన భర్జన జరిగింది ఆ మధ్య. దానికి ఈ "చెంచులక్ష్మి" చక్కని సమాధానం.

తమిళనాడు టాకీస్‌వారి చెంచులక్ష్మిని 12 తేదీ ఉ. న్యూటోన్‌లో, పత్రికా ప్రతినిధులకు ప్రత్యేకంగా చూపారు. చిత్రం చూడటానికి గం.2.15లు మాత్రమే పట్టినా, కొన్ని చోట్ల విసుగు జనించింది. అడవులలో చెంచులక్ష్మి-నారసింహుల ప్రేమలీలల ఘట్టం, చాలాసేపు చూపటంవల్ల మొనాటనస్‌గా వుందనిపించింది. అయినప్పటికీ కథ రక్తి కట్టకపోలేదు.

శిఖి నాయకుని పాత్ర నిర్వహించిన చిత్తూరు నాగయ్య గారు మొదటినుంచి చివరిదాకా అద్భుతంగా నటించారు. హావభావ ప్రకటనల్లో కొన్ని కొన్ని చోట్ల మరీ అద్భుతంగా నటించారు.

చెంచులక్ష్మి పాత్రధారిణి కమలాకోట్నీస్ తన నటనా చాతుర్యంతో నాయికి పాత్రకు అర్హురాలని రుజువు చేసుకొంది. నరసింహ పాత్రధారి నారాయణ రావుగారి మేకప్‌లో పురుషత్వం తరుగనిపించింది.

## పంచాంగము

శుక్ర మౌఢ్యమి జరుగుచున్నది.

### జనవరి తిథులు

పుష్య శుద్ధ

తే 15 శని చతుర్థి రా.గ. 5.35 వ

తే 16 ఆది పంచమి పూర్తిగ

తే 17 సోమ పంచమి ఉ.గ. 7.20 వ

తే 18 మంగళ షష్టి ఉ.గ. 9.10 వ

తే 19 బుధ సప్తమి ఉ.గ. 11.15 వ

తే 20 గురు అష్టమి ప.గ. 1.30 వ

తే 21 శుక్ర నవమి ప.గ. 3.35 వ

స్వయంపాకుల శ్రీనివాసులు, ఎం.ఏ

## నెల్లూరు సంగతులు

(4 పేజీ కొరవ)

9 గంటల వరకు వైశ్య మహా సమ్మేళన సభలు జరిగినవి. సమ్మేళనకు ముందుగా స్టోన్‌హౌస్ పేటలోని కన్యకా పరమేశ్వరి దేవాలయం నుండి టౌన్‌హాల్ వరకు ఊరేగింపు, వైశ్యులపై ప్రదర్శన కొనసాగింది. సభా వేదికపై అఖిలభారత ఆర్యవైశ్య మహాసభ రాష్ట్ర అధ్యక్ష కార్యదర్శులు కె.వి. రమణయ్య, ఒ. బాలసుబ్బయ్య శెట్టి, ఏలూరు ఎమ్మెల్యే నెరెళ్ల రాజా, విజయవాడ నాయకురాలు గ్రంధి మాధవి, టౌన్‌లోని ఆర్యవైశ్య ప్రముఖులు చీదెళ్ల వెంకటేశ్వర్లు, వైవి శేషయ్య రాజా అనంత పద్మనాభం గారు శెట్టి గోపాల్ ఆశీనులయ్యారు.

శ్రీమతి గ్రంధి మాధవి తనదైన ధోరణిలో అనర్గళంగా మాట్లాడారు. దేశానికి, రాష్ట్రానికి ఎంతో సేవ చేసి, ప్రాణత్యాగాన్ని చేసిన అమర జీవి పొట్టి శ్రీరాములు పేరును నెల్లూరు జిల్లాకు పెట్టడంలో ప్రభుత్వానికి కలుగుతున్న ఇబ్బందులేవో అర్థం కావడంలేదు. ప్రభుత్వోద్యోగాల్లో అన్ని కులాల వారికి రిజర్వేషన్లు అమలు చేస్తున్నారు. కాని వైశ్యులను మాత్రం చిన్న చూపు చూస్తున్నారన్నారామె. ప్రతి జిల్లాలో వైశ్యులకు రెండు అసెంబ్లీ స్థానాలు కేటాయించాలని డిమాండ్ చేస్తూ వైశ్యులు తమ శక్తి తాము తెలుసుకొని రాజకీయ రంగంలోకి రావాలని కోరారు. ఏలూరు శాసన సభ్యుడు నెరెళ్లరాజా మాట్లాడుతూ జిల్లాపేరు మార్పు వివిధ సమస్యలను శాసన సభలో ప్రస్తావిస్తానన్నారు. ప్రజా సంక్షేమ కార్యక్రమాల ద్వార అన్ని వర్గాల ప్రజలకు వైశ్యులు దగ్గర కావాలని సూచించారు. ఆర్య వైశ్యులను బిసి జాబితాలో చేర్చాలని, ప్రభుత్వం నెల్లూరులో కట్టే ఏదైన ప్రభుత్వ భవనానికి 'అమర జీవి' పేరు పెట్టాలని రాష్ట్రంలో సంపూర్ణ మద్య నిషేధాన్ని అమలు చేయాలని సమ్మేళన తీర్మానాలు చేసింది. పిల్లలు పాల్గొన్న సాంస్కృతిక కార్యక్రమాలు సభికులను రంజింప చేశాయి. యువ కవి, సినీ సమీక్షకుడు చిన్ని నారాయణరావు కార్యక్రమానికి వ్యాఖ్యాతగా వ్యవహరించారు.

### ఆర్టీసి ప్రతిభ

నిత్యం డ్యూటీలలో సతమత మవుతుండే డ్రైవర్లు, కండక్టర్లలో కూడా కళాతృష్ణ నివురు గప్పిన నిప్పులా దాగుంటుందని నెల్లూరు జిల్లా ఆర్టీసి కార్మికులు నిరూపించారు. డిశంబర్ 26 తేది నుండి 28 తేది వరకు హైదరాబాదు రవీంద్ర భారతిలో జరిగిన సాంస్కృతిక కార్యక్రమాల్లో ఆర్టీసి నటనాలయ సంస్థ అత్యధిక బహుమతులు గెల్చుకొని తన ప్రతిభను చాటుకొంది. కార్మికులు ప్రదర్శించిన నిశీధి నాటకం ద్వితీయ పుత్తమ ప్రదర్శనగా ఎన్నికయ్యింది. ఉత్తమ సహాయ నటుడుగా కృష్ణమూర్తి, కనుపర్తి వెంకటేశ్వర్లు, విలన్‌గా బి.ఎస్‌ఆర్. ఆంజనేయులు, ఉత్తమ నటిగా ఎం రత్నకుమారి బహుమతులు గెల్చుకున్నారు. ఇవేగాక లలిత. శాస్త్రీయ సంగీతాల్లో జి కృష్ణమూర్తి, మూకాభి నయంలో సుబ్రమణ్యం విజేతలుగా గెల్చారు.

### కంచి పరమాచార్య సంస్మరణ సభ

ఈనెల 8 తేది బ్రహ్మైక్యం పొందిన కంచి కామకోటి పీఠాధి పతి పెద్ద స్వామి పరమాచార్య చంద్రశేఖర సరస్వతి స్వాముల వారి సంస్మరణ సభను శిష్య బృందం ఆంధ్ర సభలో 16 తేది ఉదయం జరుపుతున్నారు. 9 గంటలకు స్టోన్‌హౌస్ పేట కన్యకా పరమేశ్వరి ఆలయం నుండి ఊరేగింపుగా బయలు దేరి ఆంధ్రసభకు వచ్చి సభ జరుపుతారట. ఆస్తికులంతా పాల్గొనవలసినదిగా కోరుతున్నారు.

### సినిమా

(9 పేజీ కొరవ)

కథ, అన్నారు నెల్లూరీయుడు పి.ఎస్. రామచంద్రరావు. ఈయన కథ, సర్పకత్వంలో డాక్టర్ మోటూరి కమ దేవి, ఎస్. పద్మనాభరెడ్డి నిర్మించే "లీడర్" చిత్రంలో కృష్ణంరాజు, సుమన్, లక్ష్మి, ప్రియారామన్, కోట శ్రీనివాసరావు, బాబూమోహన్, బ్రహ్మానందం, నాజర్, దేవన్, సిల్క్‌స్మిత, మనోరమ, నిర్మల పాత్రధారులు. మాటలు: హరనాధరావు. పాటలు: వేటూరి, సంగీతం: రాజ్-కోటి, శిల్పం: పేకేటి రంగా, సమర్పణ: మోటూరి శ్రీనివాస ప్రసాద్.

### చిత్రసమీక్ష

(9 పేజీ కొరవ)

సంభాషణలు ప్రత్యేకత సంతరించు కున్నాయి. సంభాషణల్లో వ్యంగ్యం బాగా ధ్వనించింది. అందులోను చక్కని హాస్యం ఉద్భవించింది. నటీనటులంతా ఈ వ్యంగ్య సంభాషణలను హాస్యం కోసం చక్కగా వాడుకొన్నారు.

రమణి, భరణి వ్రాసిన కథలో బిగువు లేదు. ఈ కథంతా అలీబాబా అనే పోలీస్ ఇన్‌స్పెక్టరు ఆరుగురు చిల్లర దొంగలకు అనుబంధంగా జరుగుతుంది. ఆరుగురు దొంగల్లో బ్రహ్మానందం, రాళ్ళపల్లి, చిడతల అప్పారావు ఒక బ్యాచ్; కోట శ్రీనివాస రావు, ఆలీ, మల్లికార్జున రావు మరో బ్యాచ్. ఈ రెండు బ్యాచ్‌లు, టి.వి. యాంటినాలు, గుడి ముందు చెప్పులు, వాటర్ టాప్‌లు దొంగలిస్తూ కలవరం సృష్టిస్తారు. వీరిని పట్టుకొనే బాధ్యత అలీబాబాకు అప్పగిస్తారు. ఇక్కడి నుంచి కథ చాలా హాస్య సన్నివేశాలను కల్పించుకొని సాగుతుంది. దొంగల యిద్దరు చెల్లెళ్లు అలీబాబాను వెంటాడి పెళ్లి చేసుకుంటారు. ఇద్దరు పెళ్లాల మధ్య చిక్కొని నరకం అనుభవించు అంటూ చిత్రం ముగుస్తుంది.

బాల్జీ కెమరా పనితనం బాగుంది. మెలోడీ మూవీస్ అని పేరు పెట్టుకున్న సంస్థ మెలోడియస్‌గా సంగీతం వినిపించింది. విద్యాసాగర్, పాటలకు కమ్మని సంగీత బాణీలు కుదిర్చాడు. వేటూరి వ్రాసిన 'నీ పేరే నా ప్రేమ' పాటలో సాహిత్యం సంగీతం రెండూ వ్యర్థంగా సాగాయి.

### అదృష్టం

(4 పేజీ కొరవ)

చెంగల్పట్టు ప్రాంతాలలోను, నెల్లూరు సీమలోను కొన్ని పరిపాలనా వ్యవహారాలను చూస్తూ, వీరు డచ్చి, ఫ్రెంచి, పోర్చుగీసు, ఆంగ్లీయాస్టిండియా కంపెనీలతో వర్తక- వాణిజ్య సంబంధాలను కల్గి వుండడాన్ని బట్టి చూస్తే వీరిద్దరు నెల్లూరు ప్రాంతీయులేనని చెప్పవచ్చు. ధనార్జనే కాక పలురాజకీయ విషయాలలోనూ వీరి కుటుంబం వారు విజయనగర పాలకులకు సహకరించినట్లు తెలుస్తుంది. ముఖ్యంగా తూర్పుకోస్తా పాలనలో వీరు విజయనగర రాజులకు తోడ్పడినట్లు తెలుస్తుంది. 1644-45 సం. ప్రాంతాలలో ఇంగ్లీషీస్టిండియా కంపెనీ ఏజంటైన థామసు ఐవీకి చంద్రగిరి పాలకుడైన శ్రీరంగ రాయలు పులికాటు ఉప ప్రాంతంలోని మదరాసు పట్టణపు పరిసరాలను కౌలుగా బదలాయించడంలో ఈ శెట్టి సోదరులతో సహా అనేక మంది తెలుగు ధనికులు సహకరించారు. మిగతా వారి పేర్లు నివాస స్థానాలు ఖచ్చితంగా తెలియవు. దక్షిణా హస్త, వామహస్త కులాలకు నాయకులైన వ్యాపార శ్రేష్టులు శేషాద్రి నాయకుడు, కోనేరు శెట్టి మరియు వారి అనుచరులయిన నెల్లూరీయులు 1640-1658 మధ్య కాలంలో చెన్నపురిలోని ఐరోపీయ కంపెనీల వారికి, ముఖ్యంగా ఆంగ్లేయాస్టిండియా వర్తకుల కెంతో తోడ్పడినట్లు తెలుస్తుంది. ఆకాలంలో పేరుగాంచిన వామహస్త కులాల వారు వ్యాపారాలు, వృత్తిపరమైన పనులు, సేవలు అందించు చుండేవారు. దక్షిణ హస్తపు కులాల వారు ప్రధానంగా పాలకులు మరియు పండితులు. ఈ విచక్షణ తెలుగు వారిలోను, కొంత వరకు తమిళులలో కూడా వుండేది. బయటి వారెవరైనా, ముఖ్యంగా మహమ్మదీయులు చెన్నపురి మీద దండెత్తినపుడు, వామహస్త కులాల వారెక్కువ మంది సైనికులుగా పోరాడగా, దక్షిణ హస్తీకులు నాయకులుగా వుండేవారు. వీరిలో కొందరు మాత్రం ఆంగ్లేయులకు ప్రాంతీయ సలహాదారులుగా వుండినారు. 1657 వ సం.లో మహమ్మదీయ సైన్యాలు చెన్నపురి మీద దండెత్తడంతో భయపడిపోయిన కోనేరుశెట్టి తప్పించుకొని పారిపోయాడు. అయితే అందుకు కారణాలు తెలియవు.

చెన్ననగరంలోని దాదాపు అన్ని ప్రాంతాలను గ్రామాదులను ఆంగ్లేయాస్టిండియా కంపెనీ వారికి బదలాయించడానికి 17,18 వ శతాబ్దాలలో నడుము గట్టి పనిచేసిన ప్రముఖులందరూ తెలుగు వారే; వారిలో చాలామంది నెల్లూరీయులే; బహుళ కారణాల వల్ల, అనేక సందర్భాలలో అవసరాల నిమిత్తమై కోరినప్పుడు వీరు తమ స్వంత బంగళాలను, తోటలను, వంశపారం పర్యమైన హక్కులను ఇంగ్లీషు కంపెనీ వారికి స్వల్ప మూల్యానికమ్మడం, బహూకరించడం లేదా అద్దెకివ్వడం జరిగింది. ముస్లిములు, మూరుల చేష్టల వల్లన కలుగ గలవనే బెదరల నన్నటినీ అతిశయోక్తులుగా వర్ణించి భయపెట్టి, స్థానికులైన తెలుగు వారిలోని వ్యక్తిగతమైన తగాదాలను, భేదాభిప్రాయాలను తమ కనుకూలంగా మలుచుకొని, వామహస్త- దక్షిణ హస్త కులాల మధ్య వివాదాలను సృష్టించి తద్వారా వారిని వారి దేవాలయాలను తమ వాణిజ్య, వ్యక్తిగతా వసరాల నిమిత్తం విరివిగా వాడుకొనడం ద్వారా చెన్నపురిలో తెల్లవారు తమ సంపాదనలను, అధికారాలను వృద్ధి పరచుకొన్నారు.

సమకాలీన రాజకీయార్థిక వ్యవస్థలో చెన్నపురి పరిసరాల్లో నెల్లూరీయుల ఆధిక్యతను గమనించిన ఆంగ్లేయ వ్యాపారులు వీరిని, వీరి ఆస్తి పాస్తులను తమ వ్యాపార వాణిజ్య లాభానుకూలంగా వుపయోగించు కోవడంలో కృత కృత్యులైనారు. ఆనాటి పాలకులైన పాళెగాండ్లు, సుబేదార్లు, జమీన్‌దార్లు, నవాబులు, రాజాలు మొదలైన వారి మూర్ఖత్వం, అనైక్యత, బ్రాహ్మణ పండితులలో నెలకొని వుండిన వ్యక్తిగత ద్వేషాలు, పదవీకాంక్ష, వర్తకులలో సహజమైన అధిక లాభాపేక్ష, పాలక పక్షపాత వైఖరి, ఇతర వృత్తుల వారిలోని మితి మీరిన కులభేదాలు, అవిద్య చెన్నపురికి చేరినప్పటికీ నెల్లూరీయులను వదలలేదు. అన్ని ఐరోపీయ వ్యాపార కంపెనీలలోనూ ఆంగ్లేయాస్టిండియా కంపెనీయే కొంత వరకు మెరుగనే విషయాన్ని తెల్సుగల్గినారే తప్ప, భవిష్యత్తులో హిందువులను ముస్లిములను కలిపి వీరు దాస్యానికి గురిచేయగలరనే ప్రమాదాన్ని వీరు పట్టించుకోలేదు.

1639 వ సం.లో చెన్నపురి స్థాపన జరిగే నాటికి ఆ చుట్టుపట్ల పాలిత ప్రాంతాలలో వుండిన సైన్యాలలో చాలా మంది నెల్లూరు సీమకు చెందిన వారేనని తెలుస్తుంది. పొదిలి లింగప్ప అనే కాకలు తీరిన సైన్యాధ్యక్షుడు తిరువళ్ళికేణి అనే బృహద్గ్రామును గోల్కొండ నవాబుల నుండి పొందివుండినాడు. ప్రక్కనే స్థావరాలనేర్పరచు కొనియున్న ఫ్రెంచి వారు స్థానికుల మీద చేస్తుండిన అత్యాచారాలు మితిమీరగా 1681 వ సం.లో లింగప్ప వీరినెదిరించి పోరాడి గెలుపొందాడు. ఇందుకు సత్కారంగా నవాబు వెంటనే లింగప్పను పడమర దిక్కున వున్న పూర్ణమల్లికు ప్రాంతీయ గవర్నరుగా నియమించాడు. చెన్నపట్నంలో తిష్టవేసియున్న ఆంగ్లేయులకు కూడా లింగప్ప కొన్ని సారు భయభ్రాంతిని కల్గించాడు. నియమిత సంఖ్యలో వున్న బ్రిటీషు వారు స్వయంగా చెన్నపురిని రక్షించుట సాధ్యంకాదు కాబట్టి వీరు స్థానికులైన గెంటు (తెలుగు) వారికి రక్షణ బాధ్యతలను నేరుగా అప్పగించారు. స్థానికులైన చెన్నపురి గెంటు కులాల, వ్యవస్థల పెద్దలందరూ కలిసి తగినంత నిధులను ప్రోగుచేసి దాదాపు 215 మంది గెంటు వీరులైన సిపాయీలను సిద్ధంచేసి చెన్ననగరాన్ని పూర్ణమల్లి గవర్నరు పొదిలి లింగప్ప భయం నుండి సదా రక్షిస్తుండినట్లు 27 జాన్ 1681 తేది కల్గిన ఫోర్టు సెయింట్ జార్జి కోట డైరీలో వుంది. అయితే ఇట్టి వారిలో ఎందరు, ఎవరు నెల్లూరు సీమలో జన్మించారు? ఎందరు నెల్లూరీయుల సంతతి వారు అనే అంశాలు ఖచ్చితంగా దొరకడం లేదు.

శ్రీమంతులైన కోమటి శెట్లు, భక్తులైన వాయుద్యు వల్ల వారు, అంటే స్థానికులు నివసించే ప్రాంతపు చెన్నపురిలో 17,18 శతాబ్దంలో అనేక దేవాలయాలను, ముఖ్యంగా శైవాలయాలను నిర్మించినట్లు తెలుస్తుంది. 1680 - 1725 సం.రాల మధ్యకాలంలో చాలా క్రొత్త దేవాలయాలను నిర్మించడమే గాక శిథిలా వస్థలో వున్న వాటిని కొన్నిటిని పునరుద్ధరించారు. పూపము గారి (Poopam's Broadway) బృహద్వీధికి తూర్పు భాగంలో నున్న శ్రీ కశ్చాలీశ్వర, శ్రీమల్లీశ్వరాలయాలు ఈ నిర్మితాలలో కొన్ని! విశేషమేమంటే, చాలావరకి ఆలయాలలోని మూల విరాట్టుల పేర్లన్నీ చెన్నపురి నుంచి ఉత్తర దిశగా పెన్నేరు వరకు వ్యాపించి యున్న దక్షిణ నెల్లూరు సీమ ప్రాంతపు ప్రాచీన దేవాలయాల మూల విరాట్టులవే, భక్తజనులలోని నెల్లూరీయతకిది ఒక ఉదాహరణం మాత్రమే.

మింటు వీధిలో వున్న శ్రీకందస్వామి, శ్రీఏకాంబరీ శ్వరాలయాలు, గూడ ఈ కాలంలో నిర్మితమైనవే. ఏకాంబరీ శ్వరాలయాన్ని శ్రీమంతుడైన వనిజాడు అలఘునాథ పిళ్ళై నిర్మించినట్లు తెలుస్తుంది. బృహద్వీధికి పశ్చిమంగా వుండిన పెద్దనాయకుని పేటలోని శ్రీచెన్నకేశవ స్వామి ఆలయాన్ని చెన్నపురి నిర్మిత దశలోనే నెల్లూరు ప్రాంతాల నుంచి వచ్చిన భక్తాగ్రేసరులు కట్టించినట్లు వినికిడి. చెన్నపురి కోట (సెయింట్ జార్జి) స్థలాన్ని స్థానికుల నుంచి సేకరించడంలోను, ఆ తర్వాత అర్మగాము నుంచి ఇంగ్లీషు కంపెనీ వస్తుసామగ్రిని చెన్నపురికి తరలించడంలోనూ సహకరించిన వాడు బేరితిమ్మన్న. అర్మగాములోను, చెన్నపురికి తరలిన తర్వాత గూడ చాలా కాలం పిరకు ఇంగ్లీషు కంపెనీ వారికి కావలసిన తుపాకి మందులు తయారు చేస్తుండిన నిపుణుడు నాగభట్టు. తిమ్మన్న నాగభట్టులు క్రమపడి 1646 - 1648 కాలంలో శ్రీచెన్నకేశవాలయాన్ని శ్రీచెన్న మల్లీశ్వరీ దేవాలయాన్ని చాలా వరకు పునర్నిర్మించారు.

ఇంకా వుంది

**ఆత్మకూరు డి.ము. కోర్టులో**

O.S. 43 / 92

కూరపాటి వెంకటేశ్వర్లు -వాది

మురమంచు పెద్ద వెంకటయ్య

S/o. వెంకటయ్య -ప్రతివాది

నారాయణం పేట (గ్రామం పోస్టు)

సీతారాంపురం (మండలం), నెల్లూరు జిల్లా

**నోటీసు**

వాది పై నంబరు దావా బాకీ రాబట్టు నిమిత్తం నీ మీద దాఖలు చేసి యున్నందున మీరు 31.1.1994 తేదిన ఉదయం 10 గంటలకు పై కోర్టులో హాజరై మీకు గల ఆక్షేపణలు తెల్పుకోని యెడల మీ పరోక్షమున దావా తీర్మానించబడును.

వాయిదా ఎల్.వి. రమణయ్య

31.1.1994వాది యొక్క న్యాయవాది

# నాదెండ్లతో పివి కుమారుడి నెయ్యంలోని ఆంతర్యం?

లోపలలో పెట్టారు. ముఖ్యమంత్రిని ఎలాగూ వ్యతిరేకిస్తున్నాం కాబట్టి, జాను జరిపే పోరాటానికి జనార్దన రెడ్డి మద్దతు కూడా వుంటే బాగుంటుందని వై.ఎస్. వర్గీయులు ప్రతిపాదన చేశారట. దానికి వై.ఎస్. కూడా పచ్చజెండా ఊపినట్లున్నారు. వై.ఎస్. వర్గానికి చెందిన ఒకరిద్దరు ఎమ్మెల్యేలు జనార్దన రెడ్డితో సంధి రాయబారానికి వెళ్లాలని ప్రయత్నాలు కూడా చేశారు. కాగా జనార్దన రెడ్డి ఢిల్లీ యాత్రలు వుండటం వల్ల ఈ రెండు వర్గాల భేటీ జరగలేదు. మాజీ మంత్రి డి.ఎల్. రవీంద్ర రెడ్డి కూడా జనార్దన రెడ్డి అంటే అమిత వాత్సల్యాన్ని వ్యక్తం చేస్తున్నాడట. అప్పట్లో తాను జనార్దన రెడ్డిని దూరం చేసుకోవటం రాజకీయంగా తప్పుడు నిర్ణయమని ఆయన చెప్పుకుంటున్నాడట. ఈ నేపథ్యంలో నాయకత్వం మార్పు ప్రచారం జరగటం. త్వరలోనే కేంద్ర మంత్రి వర్గంలో మార్పులు - చేర్పులు జరుగుతున్నాయన్న ఊహాగానాలు రావటం జరిగింది. మరో పక్క ప్రధాని పి.వి. కుటుంబ సభ్యులు కూడా కోట్ల పట్ల గుర్రుగా వున్నారు. ప్రధాని తనయుడు, పిసిసి ప్రధాన కార్యదర్శి

> **జనార్దన రెడ్డి**
> (2 పేజీ కొరవ)

పి.వి. రాజేశ్వర రావు నూతన సంవత్సరం సందర్భంగా నాదెండ్ల భాస్కర రావు ఇంటికి వెళ్లి భాయి - భాయి అంటూ చేతులు కలిపాడు. నాదెండ్ల సేవలు ఈ రాష్ట్రానికి ఎంతో అవసరమని కూడా స్టేట్‌మెంట్ ఇచ్చాడు. మరో వైపు పిసిసి అధ్యక్షుడు కూడా సిఎం అంటే పేదవి విరుస్తున్నారు. సిఎం కూడా పిసిసి అధ్యక్షుడు మళ్లీని ఇంటికి పంపే ప్రయత్నాలు చేస్తున్నారు.

× × ×

ప్రధాన మంత్రి మూడు రోజుల రాష్ట్ర పర్యటన ముఖ్యమంత్రి వ్యతిరేక వర్గాలకు ఓదార్పుగా వుండగా ముఖ్యమంత్రికి మాత్రం ముళ్లపాన్పులా తయారైంది. ప్రధాని మూడు రోజుల పర్యటనలో మొత్తం ఆరు సార్లు నిరసనలకు గురి కావల్సి రావడం ముఖ్యమంత్రి సమర్థతకు నిదర్శనమని ముఖ్యమంత్రి వ్యతిరేక వర్గాలు ప్రచారం చేస్తున్నాయి. సొంత జిల్లా కర్నూలులో ఆత్మకూరు ఎమ్మెల్యే బుడ్డా వెంగళ రెడ్డి అలకతో అక్కడి ప్రధాని సభ రసాభాసగా ముగిసింది. కాకినాడ ఎరువుల ఫ్యాక్టరీ కార్యక్రమంలో తూర్పుగోదావరి జిల్లా డిసిసి అధ్యక్షుడ్ని అనుమతించ నందుకు నిరసనగా మొత్తం 14 మంది ఎమ్మెల్యేలు ప్రధాని కార్యక్రమం అని కూడా చూడకుండా బహిష్కరించారు. అనుకోని ఈ సంఘటన పట్ల ముఖ్యమంత్రి హతాశులయ్యారు. ఈ నెలలో ఏలూరులో కాంగ్రెస్ ప్రాంతీయ సదస్సు ఏర్పాటు చేశారు. ఈ సదస్సు నిర్వహణ భారం చూస్తున్న మాజీ మంత్రి దివాకర్ రెడ్డి కూడా కాకినాడలో ఎమ్మెల్యేలు, కార్యకర్తలతో తిట్లు తినాల్సి వచ్చింది ఎమ్మెల్యేల నిరసన ప్రభావం ఏలూరు సదస్సు పై పడితే పార్టీ పరువు పోవటం ఖాయం. ఈ విషయమై తూర్పు గోదావరి జిల్లా ఎమ్మెల్యేలను బుజ్జగించటంలో ముఖ్యమంత్రి తలమునకలై వున్నారు.

ఇలా వుండగా ప్రధాని కర్నూలు జిల్లా పర్యటనలో నిరసన వ్యక్తం చేసిన రాయలసీమ పేపర్ మిల్ కార్మికులు ఆదివారం నాడు ముఖ్యమంత్రి కుమారుడు కోట్ల ప్రకాష్ రెడ్డి, ఆ జిల్లా డిసిసి, కేంద్ర బ్యాంకు అధ్యక్షులు, మంత్రి చంద్రశేఖర్ కార్ల పై రాళ్ల వర్షం కురిపించి అద్దాలు పగుల గొట్టారు. సొంత జిల్లాలో తన కుమారుడికి ఈ రకమైన పరాభవం జరగటం ముఖ్యమంత్రికి సవాలుగా తయారైంది. ప్రధాని పర్యటనలో కర్నూలు జిల్లాలో మొత్తం అయిదు సంఘటనల్లో ప్రధాన మంత్రికి పరాభవం జరిగిన సంగతి తెలిసిందే.




ఈ పరిణామాల మూలంగా ఆ జిల్లా పోలీసు సూపరింటెండెంట్‌కు స్థానచలనానికి రంగం సిద్ధమైందంటున్నారు. అయితే ఎస్.పి. బదిలీతో ఈ సమస్య పరిష్కార మవుతుందో? సొంత జిల్లాలో సొంత జనం నుంచి ఎదురవుతున్న వ్యతిరేకత ఎంత వరకు దారితీస్తుందో!

## సహనం కోల్పోతున్న కోట్ల

ప్రధాని పర్యటన కార్యక్రమాల పై ఫల్యాలు ముఖ్యమంత్రిని బాగా కుంగదీశాయి. సహజంగానే విమర్శలను తట్టుకొని నిలబడే మనస్తత్వం కాదు ఆయనది. ప్రధాని వచ్చినప్పుడు అందరూ తలో రాయి విసిరిన వారే. ముఖ్యంగా బి.సి.లు తమకు న్యాయం జరగటం లేదని ప్రధానికి ఫిర్యాదు చేయడం పట్ల కోట్ల కోపంగా వున్నారు. "బిసిలకు ఇంకేం చేయాలట. క్యాబినెట్‌లో 50 శాతం దాకా బి.సి. ఎస్.సి. ఎస్.టి.లకు ప్రాతినిధ్యం కల్పించాను. ఇంకా తృప్తి లేకపోతే ఎలా" అంటూ ఆయన సన్నిహితుల దగ్గర వాపోతున్నారు.

ప్రధాని పర్యటన చేదు ఫలితాలు త్వరలో జరుగనున్న రాజ్యసభ ఎన్నికల పై బడి తన మాట చెల్ల కుండా పోతే ఎలా అన్నది కూడా ముఖ్యమంత్రిని బాధిస్తోంది. మొత్తం అయిదు స్థానాలు కాంగ్రెస్ గెలుచుకోవచ్చు. అందులో తన వారికి కనీసం రెండు మూడు స్థానాలైనా ఇప్పించుకోక పోతే పట్టు కోల్పోయినట్లు రుజువవుతుంది. మరో పక్క ముఖ్యమంత్రి అధికారాలు కుదించి రాష్ట్ర వ్యవహారాల్ని ఢిల్లీ నుంచే నడిపిస్తారన్న వార్తలు రావడం ముఖ్యమంత్రికి అగ్ని పరీక్షలా తయారైంది. మార్చితో రాష్ట్ర పిసిసి అధ్యక్షుడికి స్థాన చలనం వుంటుంది. పిసిసి పీఠం పై తన వర్గీయుడ్ని కూర్చో పెట్టుకోవాలన్న ముఖ్యమంత్రి కోరిక కూడా ఇప్పుడు ప్రశ్నార్థకంగా తయారైంది. ఈ నెలఖరులో జరుగనున్న కేంద్రమంత్రి వర్గంలో కూడా కోట్లతో ప్రమేయం లేని వారిని తీసుకునే అవకాశాలు కనిపిస్తున్నాయి. అదే జరిగితే ముఖ్యమంత్రి రాజకీయంగా బలహీనుడవటం ఖాయం. సాధారణ ఎన్నికలు మరో 13 నెలల్లో ముంచు కొస్తుండగా సమస్యలన్నీ ఒక్కసారిగా కోట్ల కోటను ముంచెత్తటం ముఖ్యమంత్రి ఊహించని పరిణామం.

## ప్రధాని మంచి వాడే, కానీ ముఖ్యమంత్రే...?

ఇప్పటి దాకా ప్రధాన మంత్రి పి.వి. నరసింహా రావుకు వ్యతిరేకిగా వ్యవహరిస్తున్న వై.ఎస్. రాజశేఖర రెడ్డి ప్రస్తుత రాజకీయ పరిస్థితుల దృష్ట్యా తన వ్యూహాన్ని కూడా మార్చుకున్నారు. కోట్ల విజయభాస్కర రెడ్డిని దెబ్బతీయాలంటే ఢిల్లీ ఆశీస్సులు తప్పనిసరిగా వుండాలని ఆయన భావిస్తున్నారు. అందుకే ప్రధాన మంత్రి మంచి వారే కాని ముఖ్యమంత్రే పార్టీ ప్రయోజనాల్ని దెబ్బ తీస్తున్నాడని ప్రచారం మొదలు పెట్టారు. ఇటీవల వై.ఎస్. ఢిల్లీకి వెళ్లి ప్రధాన మంత్రిని, ఇతర అధిష్టానం పెద్దల్ని కలుసుకొని ప్రధాన మంత్రికి తన మద్దతు ప్రకటించడంతో పాటు ముఖ్యమంత్రిని మార్చాలని నచ్చజెప్పచూశాడట.




## రాష్ట్రం పగ్గాలు

(2 పేజీ కొరవ)

పై కూర్చున్నా రిమోట్ కంట్రోల్ పి.వి. గుప్పెట్లో వుండటం విజయభాస్కర రెడ్డి ఎలా సహిస్తారన్నది వేచి చూడాల్సిందే. కాగా త్వరలో కేంద్రంలో జరుగనున్న మంత్రి వర్గ మార్పుల్లో రాష్ట్రం నుండి ఒకరిద్దరు తన సొంత మనుషుల్ని మంత్రి మండలిలోనికి తీసుకోవాలని ప్రధాని యోచిస్తున్నారు. అదే జరిగితే రాష్ట్రంలో ముఖ్యమంత్రి ప్రభ తగ్గటానికి నాంది అవుతుంది.

### ప్రధాని రహస్య సర్వేలు

ప్రధాని రాష్ట్ర పర్యటనకు ముందే రహస్యంగా సర్వేలు జరిపించారట. ఈ విషయాన్ని ఆయనే స్వయంగా తన అంతరంగికులతో చెప్పారు. రాష్ట్ర ప్రభుత్వం పని తీరు ఎలా వుంది? కాంగ్రెస్ పార్టీ పట్ల ప్రజలే మనుకొంటున్నారు. తెలుగుదేశం గాలి ఎలా వుంది తదితర అంశాల పై ప్రధాని సర్వేలు జరిపించారట. రాష్ట్రంలో ఆంధ్ర, రాయలసీమ, తెలంగాణా ప్రాంతాల్లో తెలుగుదేశం ప్రభంజనం వుందని, రాష్ట్రంలో బిసిలతో పాటు ఇతర బడుగు వర్గాలన్నీ కాంగ్రెస్‌కు వ్యతిరేకంగా తయారవుతున్నాయని సర్వేల్లో వెల్లడైనట్లు ప్రధానే స్వయంగా చెప్పారట. ఈ కారణంగానే ఇక పై ఢిల్లీ నుంచే చక్రం తిప్పి పార్టీ పరిస్థితిని చక్కదిద్దాలని పివి నిర్ణయించారట.

### కోట్లతో రవీందర్ ఢీ

పార్టీ క్రమశిక్షణ ఉల్లంఘించి [illegible] కాంగ్రెస్ లెజిస్లేచర్ పార్టీ [illegible] షోకాజ్ నోటీసుకు గట్టిగానే సమాధానం ఇవ్వాలని మాజీ మంత్రి రవీంద్రా రెడ్డి నిర్ణయించారు. ఈ విషయంలో "కాళ్లబేరం" చేయకుండా ముఖ్యమంత్రి పై ఎదురుదాడికి ఆయన సిద్ధమయ్యాడు. కోట్ల విజయభాస్కర రెడ్డి పార్టీలో వ్యవహరిస్తున్న తీరు తెన్నులు - వివిధ వర్గాల్ని ఆయన దూరం చేస్తున్న వైనాన్ని వివరించడంతో పాటు కాంగ్రెస్ పార్టీకి ఆయన ఎప్పుడూ విధేయుడు కాదని, [illegible]వాద రాజకీయాలతో రెడ్డి కాంగ్రెస్‌లో చేరిన సంఘటనలు కూడా షోకాజ్ సమాధానంలో పొందు పరుస్తున్నారట. షోకాజ్ సమాధానంలో కూడా ప్రధాని అనుకూల వైఖరితో పాటు కోట్ల పట్ల వ్యతిరేకతను వ్యక్తం చేస్తున్నట్లు అభిజ్ఞ వర్గాల భోగట్టా.

## బ్రహ్మాండమనుకున్న తెలుగుదేశం మహిళా సదస్సు తుస్సుమన్నది!

# ఇంత అవమానం ఎందుకు జరిగినట్లు?

తెలుగు దేశం మహిళా సదస్సు తుస్సు మన్నది; బ్రహ్మాండ మనుకున్నది కాస్త నీటి బుడగవలె తేలిపోయింది; కొండంత రాగం తీసి తుమ్మెద పదం పాడినట్లయింది. 7

> **తెలుగుదేశం మహిళా సదస్సుకు మహిళలు రానేరాలేదు; ఆశించిన జనం లేరనే కోపంతో ఎన్టీఆర్ వేదిక నెక్కనన్నాడు; జిల్లా నేతలకు తలవాచే చీవాట్లు పెట్టాడు!**

తేది నెల్లూరులో జరిగిన తెలుగు మహిళా సదస్సు సభూతో, నభవిష్యతి అన్నట్లుండని, చరిత్రలో ఎరుగని రీతిలో జరుగుతుందని భ్రమ కల్పించారు నాయకులు. రాజమండ్రి, నల్గొండ, కర్నూలు సదస్సులు చూచిన తర్వాత అది నిజమేనేమో నన్పించింది కూడా! కాని తీరా 7 తేది సాయంత్రం ఎసి స్టేడియంకు వెళ్లె అంతా హళాళక్కి అయి పోయింది; నవ్వులాటగా మారింది. కనీసం స్టేడియం నిండి వుండినా ఇంత రచ్చ, చర్చ లేకుండా పోయేది. కాని, చల్లటి సాయంకాలపు మంచి మాపు వేళలో ఆహ్లాదకర వాతావరణం వుండి కూడా మూలాంతులకు మించి, నిండ లేదు. అదే ఎన్టీఆర్‌కు అవమానంగా తోచింది. కోపం పట్టలేక పోయారు. దానితో రాష్ట్రమంతా తనకు తెలియ కుండానే తానుగా తన సదస్సు వైఫల్యాన్ని ప్రచారం చేసుకున్నారు.

అసలాయన వేకువన రైలు దిగి నప్పటి నుంచి నలతగానే కన్పించారు. స్టేషన్ నుంచి కారు వరకు లక్ష్మి పార్వతి భుజం పైన ఒక చేయి, అల్లాడి రాజ్ కుమార్ భుజం పైన ఇంకొక చేయి వేసి మెల్లగా నడిచారు. అల్లీపురంలో శ్రీ చంద్రమోహన్ రెడ్డి ఇంటిలో బస. పొద్దున 8 గంటల వరకు దంపతు లిద్దరూ విశ్రాంతి తీసుకున్నారు. తర్వాత జిల్లా నాయకుల పూల మాలల సత్కారాలు. 11 గంటలకు ప్రెస కాన్ఫరెన్స్. ప్రెస్ వాళ్లు అడిగిందేమీలేదు- ఆయనే నలభై నిముషాలు అనర్గళోపన్యాసం చేశారు. 2.15 ప్రాంతంలో ఆ రోజే రిలైజన సినిమా వదలిన జనం కలిపారు. సమాజంలో 51 శాతం మంది ఆడ బిడ్డలున్నప్పటికీ వారికి న్యాయం జరగడం లేదని, త్రేతాయుగంలో సీత, ద్వాపర యుగంలో ద్రౌపది కూడా పురుషాధిక్యానికి బలై పోయారని; ఈ యుగంలో కాంగ్రెస్ పాలనలో స్త్రీ కృంగి కృశించి పోతున్నదని; ఆడ వారికి న్యాయం చేసి, వారి రుణం తీర్చుకోవడానికి తెలుగు దేశం ఎన్నో పనులు చేసిందని, ఇంకేమి చేస్తామో మహిళా సదస్సులో చెప్తామని గుక్క తిప్పుకోకుండా ఉపన్యాసం దంచేశారు.

ఒంటి గంటకు నర్తకి సెంటర్ నుంచి ఊరేగింపు. కాని ఆశించినంత మంది జనం రాక పోవడంతో ఒక గంట ఆలస్యం చేశారు. ఊరేగింపు మద్రాసు బస్టాండు చేరే సరికి జనం బాగానే పోగయ్యారు. అయితే స్టేడియం పల్చగా వున్నందువల్ల మెల్లగా నడిపించి, ఆలస్యం చేయమని చంద్రబాబుగారు ఒకటికి నాలుగు వర్తమానాలు పంపారు. ఒక గంట




## లక్ష్మీపార్వతిని చూడను వచ్చారు- ఎన్టీఆర్‌ను ఈసడించి వెళ్లారు!

సేపు నెట్టి చూశాడు ఎన్టీఆర్, ఆ తర్వాత ఓర్పు నశించింది. టిటిడి కళ్యాణ మండపం నుంచి ప్రదర్శన వేగం పెంచేశాడు. స్టేడియం చేరే సరికి సాయంత్రం 4.50 అయింది. సభ జరప డానికి అంతకంటే అనువైన సమయం వుండదు. అయినా జనం పల్చగా కన్పడ్డారు; వేదిక మాత్రం కిట కిట లాడు తుండింది. ఎన్టీఆర్‌కు చిర్రెత్తు కొచ్చింది. అందర్నీ క్రిందకు దించితే తప్ప తాను ఎక్కనని ఊరేగింపు వచ్చిన లారీలో భీష్మించుకొని కూర్చున్నారు. రేణుకా

> **మహిళా సదస్సనే పేరే తప్ప మహిళల సమస్యల పై మాట్లాడనేలేదు; ఆడంబరమన్న అలంకరణలూ అన్నగారి డబ్బు కక్కుర్తికి అధ్వాన్నమైనాయి!**

చౌదరి, ప్రతిభా భారతి సర్ది చెప్పబోతే కస్సుమన్నాడు. చంద్రబాబు మాటా విన్పించుకోలేదు. సభ నుంచి వెళ్లి పోతానని బెదరించాడు. ఇక గత్యంతరం లేక చంద్రబాబు పోలీసులా వ్యవహరించి, వేదిక పైనున్న వారందరినీ- క్రిందకు దించి వేశారు. అప్పుడు కేవలం 15 మందిని మాత్రం వేదిక నెక్కమని చెప్పి, తాను లక్ష్మి పార్వతి భుజంపై చేయి వేసి, యువ ప్రేమికుల జంట మాదిరి పైకి వచ్చారు. నెల్లూరు జిల్లాకు సంబంధించి సోమి రెడ్డి చంద్రమోహన్ రెడ్డి, డాక్టర్ నాగ భూషణమ్మలకు మాత్రమే వేదిక అలంకరించే అదృష్టం పట్టింది. బేగా నారసింహా రెడ్డి, ఎన్సిలనూ క్రిందనే నిలబెట్టేశారు. ఈ అవమానం సహించలేక ఎన్సి సభ ప్రారంభం కాక ముందే వెళ్లి పోయారు. ఆయన్ను చూస్తె జాలి వేసింది. స్టేజి మీద కూర్చునే పాటి గుర్తింపు, గౌరవం కూడా దక్కని పెద్దరికం దేనికి చెప్పండి పాపం! బ్యారికేడ్ల దగ్గర బికారుల వలె నిల్చుని వుండిన జిల్లా నాయకులను చూసి చంద్రబాబు బాధపడి, పైకి రప్పించే యత్నం చేశాడట; కాని ఎన్టీఆర్ వప్పుకోలేదు. వైటి నాయుడు, చంద్రమోహన్‌రెడ్డి, రమేష్ రెడ్డి వంటి వారు అన్నా, వదినలకు గజ మాలలు వేశారు. శ్రీ నల్లపరెడ్డి ప్రసన్న కుమార్ రెడ్డి జరిగతో అల్లిన తలపాగా పెట్టారు; నల్లపరెడ్డి రాజేంద్ర కుమార్ రెడ్డి

> **ఆమె పై చేయి వేయకుండా అడుగు కదపడం లేదు!**

గాంధీ బొమ్మ బహూకరించారు.

చంద్ర మోహన్ రెడ్డి స్వాగతోపన్యాసం; భజనే సారాంశం! రేణుకా చౌదరి, ప్రతిభా భారతి, ప్రత్తి మణెమ్మ, నాగ భూషణమ్మ, పంషార్ బేగం, కల్పనా దేవి మాట్లాడారు.

కొరవ 7 పేజీలో





Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. OFFSET Printing at Nayagara Paper Products (India) Ltd.,